# జడకుచ్చులు



శ్రీ

[illegible]

[illegible] సమర్పించ[illegible]

[illegible]

[illegible]

[illegible] 26-7-[illegible]



M. Subba Rao
1st July 1925.

కర్త:

రాయప్రోలు సుబ్బారావు

వెల ౧-౦-౦


ఆలపొదుగులఁ
ప్రాణపయస్సు
గురియ
శాలిభూముల
ధాన్యమంజరులు
మెరయ
జాతిపూవుల స్వచ్ఛంద సౌరభము లొలుక
పరపు మీయాంధ్రజగతి సువర్ణవృష్టి.

సువర్ణవృష్టి.

# వి జ్ఞ ప్తి

ఇందలి పద్యములు పలుపత్రికలనుండి యేరికొంటిని. ఆంధ్రభారతి, గ్రంథాలయసర్వస్వములు అందు ముఖ్యములు. ఏతత్పత్రికాధిపతుల ఐయ్యకోలున కెంతయుఁ గృతజ్ఞుఁడను. చేర్పఁదలచిన మఱికొన్నిపద్యములు విస్మృతి గహనముపాలై దొరికినవికావు. రసికులకిం దేవియేని రుచించినఁ గృతకృత్యుఁడను.

—గ్రంథకర్త.

కం. పాయలు పాయలుగా విడి

పోయిన నా తెనుఁగుకన్నె ముఁగురులకు వే

ణీ యోగ్యాభరణముగా

నీయెడ జడకుచ్చు లల్లి యిచ్చితిఁ బ్రీతిన్.



## జన్మభూమి



ఏదేశమేగినా ♦ ఎందుఁ గాలిడిన
ఏపీఠ మెక్కినా ♦ యెవ రెదురయిన
పొగడరా నీతల్లి ♦ భూమి భారతిని
నిలుపరా నీజాతి ♦ నిండుగర్వమ్ము
లేదురా యిటువంటి ♦ భూదేవి యెందు
లేరురా మనవంటి ♦ ధీరు లింకెందు.

ఏపూర్వపుణ్యమో ♦ ఏయోగబలమొ!
జనియించినాడ వీ ♦ స్వర్గలోకమున
ఏమంచిపూవులఁ ♦ బ్రేమించినావొ!
నినుమోచె నీతల్లి ♦ కనకగర్భమున.

సూర్యుని వెలుతురు ♦ సోకునందాక
ఓడల జెండాలు ♦ ఆడునందాక
నరుడు ప్రాణాలతో ♦ నడుచునందాక
అందాకగల యీ య ♦ నంత భూతలిని
మనభూమివంటి క ♦ మ్మని భూమిలేదు.

తమతపస్సులు ఋషుల్ ♦ ధారఁబోయంగ
చండవీర్యము శూర ♦ చంద్రు లర్పింప

రాగదుగ్ధము భక్తి ♦ రాజు లీయంగ
భావసూత్రము కవి ♦ బాంధవు లల్ల

దిక్కుల కెగఁదన్ను ♦ తేజంబు వెలుఁగ
జగముల నూగించు ♦ మగతనం బెగయ
రాలు పూవులుసేయు ♦ రాగాలు సాగ
సౌందర్య మొగఁబోయు ♦ సాహిత్యమొప్ప

వెలిగిన దీదివ్య ♦ విశ్వంబు పుత్రి!
దీపించె నీపుణ్య ♦ దేశంబు పుత్రి!

అవమాన మేలరా! ♦ అనుమాన మేల!
భరతపుత్రిఁడనంచు ♦ భక్తితోఁబలుక!



# తమ్ముడా!




లుపొంగిన ♦ జీవగడ్డయి
పాలు పారిన ♦ భాగ్యసీమయి
వ్రాలినది యీ ♦ భరతవర్షము
భక్తి పాడర తమ్ముడా!

౨ వేదశాఖలు ♦ వెలసె నిచ్చట
ఆదికావ్యం ♦ బలరె నిచ్చట
బాదరాయణ ♦ పరమఋషులకు
పాదు సుమ్మిది తమ్ముడా!

౩ విపిన బంధుర ♦ వృక్ష వాటిక
ఉపనిషన్మధు ♦ వొలికె నిచ్చట
విపులతత్త్వము ♦ విస్తరించిన
విశ్వవాణి యిదె తమ్ముడా!

౪ సూత్రయుగముల ♦ శుద్ధవాసన
క్షాత్రయుగముల ♦ చండ శౌర్యము
చిత్రదాస్యము ♦ చే చరిత్రల
చెఱిగిపోయెర తమ్ముడా!

౫ మేలికిన్నెర ♦ మేళవించీ
రాలు గరుగగ ♦ రాగమెత్తీ
పాల తీయని ♦ బాల భారత
పదము పాడర తమ్ముడా!

౬ నవరసమ్ములు ♦ నాట్యమాడగ
చివురుపలుకులు ♦ చెవుల విందుగ
కవితలల్లిన ♦ కాంత హృదయుల
గారవింపర తమ్ముడా!

౭ దేశగర్వము ♦ దీప్తి జెందగ
దేశచరిత్రము ♦ తేజరిల్లగ
దేశ మరసిన ♦ ధీరపురుషుల
తెలిసి పాడర తమ్ముడా!

౮ పాండవేయుల ♦ పదునుకత్తులు
మండి మెఱసిన ♦ మహిత రణకథ
కండగల చి ♦ క్కని తెనుంగుల.
కలిపి పాడర తమ్ముడా!

౯ లోక మంతకు ♦ కాక బెట్టిన
కాకతీయుల ♦ కదన పాండితి
చీకిపోవని ♦ చేవమాటల
చేర్చి పాడర తమ్ముడా!

౧౦ తుంగభద్రా ♦ భంగములతో
పొంగి నింగిని ♦ పొడచి తుళ్ళి
భంగపడని తె ♦ నుంగు నాథుల
పాటబాడర తమ్ముడా!

తమ్ముడా! 

౧౧ పసుపుకొంగుల ♦ ముసుగు లెడలగ
కొసలు తీర్చిన ♦ కోరకత్తుల
కసరిపోరిన ♦ గండు యోధులఁ
పదము బాడగ తమ్ముడా!

—ంంంం—

# ఆంధ్రమాత

శా. శ్రీలింపొందగ యావదాంధ్రజనమా ♦ తృష్మాతలీనూత్న తే
జోలీలామృతమూని, దద్బలవదా ♦ త్మైక్యంబునన్ తావకో
ద్వేలప్రాక్తన కీర్తిగీతముల న ♦ ర్థింబాడు నీపుత్ర పు
త్రీలోకమ్మున కేమిదెల్పెదవు సం ♦ దేశంబు నాంధ్రావనీ!

శా. ఆశల్ కౌతుకపూర్ణచంద్రికలుపూ ♦ యన్ దుర్దినాచ్ఛాదమా
కాశమ్మున్ విడిపోవ, నూతనకళో ♦ త్కర్షాప్తిమై మాతృపూ
జాశోభల్ దయివారు నీశుభదినో ♦ త్సాహంబునీక్షించి, నీ
యాశీర్వాదములిమ్ము పుత్రులకు సం ♦ బా! యాంధ్రదేవీమణీ!

శా. తేటల్ దేరెడు కాంతిపూరముల ను ♦ ద్దీపించు ముత్యాల మా
ప్పేటల్ వోలె ద్వదీయకంఠమున శో ♦ భింపుల్ నిగారించు, చే
నాటన్ జీవనశోషణల్ గనని కృ ♦ ష్ణాగౌతమీ భద్రలన్
గాటంపుందమిఁద్రావువారమిదె కాం ♦ క్షాక్షీరమాంధ్రావనీ!

శా. ఆ చాళుక్యనృపాలరత్నముల వి ♦ ద్యుమ్మొంది, శ్రీకాకతి
క్ష్మాచక్రేశుల లాలనల్ వడసి, కృ ♦ ష్ణప్రాజ్యసామ్రాజ్య పీ
ఠీచంచజ్జయకన్యతో సరసగో ♦ ష్ఠిన్ ప్రొద్దుపోఁబుచ్చు, నీ
ప్రాచీనాభ్యుదయమ్మునెన్నెదరు గ ♦ ర్వస్ఫూర్తి తల్లీ! సుతుల్

శా. ఉద్యన్మోహనమై, కుమారజన గ ♦ ర్వోద్రేకమై, యాత్రిలిం
గోద్యానాప్తమధూదయమ్మగు నవీ ♦ నోత్సాహపున్ వేళ, నా

విద్యారణ్యయుగంధరాదుల యశో♦విర్యమ్ము లగ్గించు, చి
విద్యాస్నాతకు లానఁ జేసెదరు, దే♦వీ! సంప్రసాదింపవే.

ఉ. జారిన దేశగౌరవముఁ ♦ జక్కనొనర్చి, మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగఁ♦ బాలనఁ జేసిన మాన రాష్ట్రముల్
కూరిమి నానఁ జేతు, తెలు♦గుం బుడమిం గయిసేతురయ్య, దీ
పారతి నాంధ్రపుత్రులు! జ♦గజ్జనధర్మమె దృష్టినిల్పుచున్,

శా. ఉల్లాసమ్మున మాతృసేన పయిపై ♦ నుత్తాలతరంగంగ నా
పల్లీ పక్కణ దిగ్దిగంతర తలీ ♦ పర్యంత వేంగీభువిన్
జల్లుండాంధ్రము పైఁ బ్రాద్యమ ప్రథమ పూ♦జా పుష్పముల్ ప్రేమపుం
ద్రాళ్ళం గట్టుఁడు యావదాంధ్ర జనసం♦తానమ్ము నా సైహితుల్.

సీ. రణరక్తబంధురా♦యణమైన ఖడ్గతి
క్కన కత్తికడిగిన ♦ కదనభూమి [1]
అమృతాక్షరవిశాన♦ముయిన యా సుకవి పో
తన లేఖిని ప్రశాంతిఁ ♦ గనిన చోటు [2]
భాషామారిక ♦ బ్రపుఁ బెండ్లియైన
కృష్ణరాజ్యము వెలిం♦గినతలమ్ము [3]
నానావిదేశనా♦వానీక విపులాశ్ర
యంబైన రేవుఁ రూ♦పటిన తావు

---

౧. పాలేటియొడ్డు, ౨. ఒంటిమిట్ట, ౩. విద్యానగరము, ౪. బాపట్లసమీపము మోటుపల్లి.

సీ. పాడయి శిలావశిష్టమై ♦ ప్రాప్తకాల
మనుభవించుచు, నుండెడు ♦ నక్కటకట!
బ్రతికిచెడ్డయాంధ్రుల పూర్వ ♦ వైభవంబు
చాటెడిని నాలకింపుడు ♦ శాంతమతులు!

మ. కలదాంధ్రోద్యమవల్లికాకుసుమ రే♦ఖామాలికాకాంతి తుం
దిలశోభాంకురపుంజముల్ భరతమా♦తృస్ఫీతిచూడామణీ!
కలితచ్ఛాయల నందగింపఁగల భా♦గ్యంబింక, నీసాంగమం
గళకళ్యాణముఁ బాడఁబుత్రికలవే♦డ్కన్ వత్తురా నాఁటికిన్.

శా. సంతోషింపగదమ్మ! యాంధ్రజననీ! ♦ సారస్వతస్నానవి
శ్రాంతిప్రీతుల, నీదుపుత్రకుల, దీ♦క్షాబద్ధులంజూచి ని
శ్చింతన్ సోదరులారా! భూజననిఁ బూ♦జింపుండు బ్రహ్మార్పణో
దంతవ్యక్తిమనోబలమ్మున దధా♦స్తంచున్ బుధుల్ పల్కఁగన్



# ప్రబోధము



అమరావతీపట్ట ♦ ణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థా ♦ పించునాఁడు
ఓరుగల్లున రాజ ♦ వీరలాంఛనముగాఁ
బలుశస్త్రశాలలు ♦ నిలుపునాఁడు
విద్యానగరరాజ ♦ వీథులఁ గవితకు
పెండ్లిపందిళ్ళు క ♦ ప్పించునాఁడు
పాట్నూరికి సమీప ♦ మున నాంధ్రసామ్రాజ్య
దిగ్జయస్తంభ మె ♦ త్తించునాఁడు

గీ. ఆంధ్రసంతతికే మహి ♦ తాభిమాన
దివ్యదీక్షాసుఖస్ఫూర్తి ♦ తీవరించె
నామహావేశ మర్థించి ♦ యాంధ్రులార!
చల్లుఁ డాంధ్రలోకమున న ♦ క్షతలు నేఁడు॥

సీ. తనగీతి యలవజా ♦ తిని పాటకులనుగా
దిద్ది వర్ధిల్లిన ♦ తెనుఁగువాణి
తనపోటులు విరోధి ♦ తండంబులకు సహిం
పనివిగా మెఱసిన ♦ తెలుఁగుకత్తి
తనయందములు ప్రాంత ♦ జనుల కభిరుచి వా
సన నేర్ప నలరిన ♦ తెనుఁగురేఖ
తనవేణికలు వసుం ♦ ధరను సస్యశ్యామ
లను జేయఁ జెలఁగిన ♦ తెనుఁగుభూమి

గీ. అస్మదార్ద్రమనోవీథి ♦ నోసహింప
జ్ఞప్తి కెలయించుచున్నాఁడ! ♦ చావలేదు
చావలేదు ఆంధ్రులమహో ♦ జ్జ్వలచరిత్ర
హృదయములు చీల్చిచదువుఁడో ♦ సదయులార!

సీ. కృష్ణాతరంగ పం ♦ క్తిఁ ద్రొక్కి త్రుళ్ళింత
నాంధ్రనౌకలు నాట్య ♦ మాడునాఁడు
ఇంటింట దేశి సా ♦ హిత్యదీపములతో
నాంధ్రతేజస్సు బా ♦ పాడునాఁడు
సుకుమారశిల్పవ ♦ స్తు ప్రపంచమునందు
నాంధ్రనైపుణి పంతె ♦ మాడునాఁడు
సమదసేనావ్యూహ ♦ జయపతాకల క్రింద
నాంధ్రపౌరుషము చెం ♦ డాడునాఁడు

గీ॥ చూచి, సంతోషమున తల ♦ లూఁచి, గర్వ
మాచి, ఆంధ్రపుత్రీపుత్రు ♦ లందఁగలరు
శాంతి, నందాక లేదు వి ♦ శ్రాంతి మనకు
కంకణవిసర్జనల కిది ♦ కాలమగునె॥



# పుస్తకము



నిండాఱఁబాఱు న ♦ ఖండగోదావరి
దాగిన చాళుక్య ♦ నాగరికత,
పాడైన పెనుకోట ♦ గోడల దీర్ఘాని
ద్రలువోవు కాకతి ♦ ప్రాభవమ్ము
పల్లెపదాల జీ ♦ వము నిల్పికొన్న వ
ల్నాటివీరుల రక్త ♦ నాళపటిమ,
కడలేక యేడ్చు తుం ♦ గాభద్ర కెరటాల
మణఁగిన ప్రాజ్యసా ♦ మ్రాజ్యభరము

తే. గీ. హృదయములువిన పలుకరి ♦ చదువుజెప్పు
పుస్తకతపస్విని తెలుంగు ♦ పూలపొదల
నిలిచి సేవాశుకమ్ములఁ ♦ బిలిచిపిలిచి
స్థిరత పాడించుగాత జా ♦ తీయగీతి॥

సీ. ఆచారమునకు దా ♦ స్యముఁ జేయుచును వంట
యిల్లుదాటఁగలేని ♦ యిందుముఖుల,
ఉదయాస్తమయములు ♦ నొడలిచెమ్మటఁదీసి
క్షేత్రసేవలుజేయు ♦ సేద్యగాండ్ర,
బ్రతికినన్నాళ్ళు తీ ♦ అనికస్తి, రెక్కలు
విఱిచిజీవించెడు ♦ పేదజనుల,
అక్షరపంక్తులె ♦ యెఱయరాదనుచు, దు
ర్గతులఁద్రోసిన చెప్ప ♦ రానివాండ్ర,

తే. గీ. పూలతో నిండి కమ్మద ♦ నాలు చిమ్మ
పుస్తకనికుంజపుంజాళి ♦ పొంతఁ బిలిచి
“నా జననీ, నాదు దేశ” మ ♦ నంగఁ జాలు
ఇంత జ్ఞానభిక్షాదాన ♦ మిమ్ము తల్లి!

సీ. ఆంధ్రుల శిల్ప వి ♦ న్యాసంబు చూపించు
కలిమి గోపురముల ♦ గలదటంచు
ఆంధ్ర నాగరిక క ♦ ళ్యాణచిహ్నములైన
గానసాహిత్యముల్ ♦ గలవటంచు
ఆంధ్ర భాగ్యమ్ము మో ♦ యగ గౌతమీకృష్ణ
దరులను నావలు ♦ దిరిగెననుచు
ఆంధ్రవీరులకు స్వ ♦ ర్గాతిథ్యమిచ్చి పా
టలుపాడిన యుగమ్ము ♦ కలదటంచు

తే. గీ. చెప్పి యొప్పించు పుస్తక ♦ శ్రీకుమారి
యందగింపఁగఁ గల యాల ♦ యములు గట్టుఁ
డాంధ్ర దేశమునం దెల్ల ♦ నాంధ్రపుత్రు
లాప్తమానవసంఘ సే ♦ వానురక్తి॥

# † వసంతము

[శ్రీ రవీంద్రనాథ ఠాకూరు విరచితము.]




ను వచ్చానమ్మా ♦ నేనువచ్చానె
ఆలసింపకరారె ♦ యాడుకొందాము.

* * *

ఏడాది తొలికౌగి ♦ లెచటదాచారె?
నా పూలపల్లకీ ♦ నేపొంత నిడిరె?
తేనె వసంతాల ♦ తీర్థమ్ములాడి
పసుపుకోకలు పిరుం ♦ దసియాడ దాల్చి
నేను వచ్చానమ్మా ♦ నేను వచ్చానె
ఆలసింపకరారె ♦ యాడుకొందాము.

వేకువే వికసించు ♦ వేసాలమొల్ల!
ప్రొద్దుప్రొద్దునపూయు ♦ ముద్దైనరోజా!
మవ్వముల్ రువ్వేటి ♦ మధ్యాహ్నమల్లె!
అందాలువిదికేటి ♦ సంపెనంపంగి!
పరిమళం బెగబోయు ♦ పచ్చగోరంట!
పైరగాలికినవ్వు ♦ పడుచుగేదంగి!

నేను వచ్చానమ్మ ♦ నేను వచ్చానె
ఆలసింపకరారె ♦ ఆడుకొందాము.

* * *

చూచినామోయి కు ♦ చ్చుల పూలరంగ!
నీముద్దురూపు వ ♦ న్నెలకోడెకాడ!
చిగురుపాగాచెంగు ♦ లెగిరి జీరాడ!
పడుచుప్రాయము తీవి ♦ పగిలిపోవంగ
తోపుచీరెలమావి ♦ దాపలిదిశల
విరజాజిపందిళ్ళ ♦ వెలపలిపొదల
  నిన్నుజూచామోయి ♦ నెఱజాణతునక!
  నీకు చిక్కామోయి ♦ పోకిళ్ళపుట్ట!

*  *  *

ఎవ్వరే ననుబల్కు ♦ రంచేరు ఇచట
మురళివాయిస్తు నే ♦ పోవుచుండగను

*  *  *

మావికొమ్మను నేను ♦ మన్మథాకార!
నిలుపంజాలనిరక్తి ♦ నిన్ను పిల్చేను.
నిన్నుజూడకమున్నె ♦ నీదివ్యమూర్తి
నీపూతవాసనల్ ♦ రాపాడి నన్ను
నాచిత్తబలమెల్ల ♦ దోచెంగదోయి!
నాగర్వరాగంబు ♦ లాగెంగదోయి!
నిన్నెఱుంగకముందె ♦ నిన్నుభావించి
ప్రేమించినానోయి ♦ బేలనై స్వామి!
  మావికొమ్మను నేను ♦ మన్మథాకార!
  నిలుపంజాలనిరక్తి ♦ నిన్ను పిల్చేను.

*  *  *

తొలిజాము చల్లగా ◆ తొలగినపిదప
ఆటపాటలరక్తి ◆ చాలసిన వెనుక
వీధిలోపల ధూళి ◆ వేడిమెత్తంగ,
కడవల నీరాన ◆ కాక లేగంగ,
వేసవి తలసూప ◆ నేసొక్కి సోలి
నిష్క్రమింతా వేళ ◆ నిలుతురే మీరు?
　　ఎవ్వరే నను బల్క ◆ రించేరు ఇచట
　　మురళి వాయిస్తు నే ◆ పోవుచుండగను.
నేను వస్తానోయి ◆ నేను వస్తాను
మొగ్గమల్లెను నేను ◆ మురిపాలమొలక!
నీయుత్తరీయంపు ◆ నీడబట్టికొని
నీకప్పురపుతమ్మ ◆ నిగ్గుసందికొని
నీనిల్వుటిలకమ్ము ◆ లోనచెమ్మగిలి
నీరాగమాలలో ◆ దారమైపెనగి
వలపుతో కడదాక ◆ నిలిచియుంటాను
ఆసతో సందాక ◆ అంటియుంటాను.

* * *

సన్నజాజిని నేను ◆ సరసాలచైత్ర!
తేనెచిన్కను నేను ◆ తీపారుపుత్ర!
నీ సిగపూలలో ◆ వాసనై యణగి
నీకంఠమాలలో ◆ రేణువై కలసి
పూలు రేకులుకూడి ◆ పాలుపారుదాక
తమ్మితూడునుగూడి ◆ తనివొందుదాక

నీ వాక్కు కర్థమై ♦ నే వెల్లుతాను
నీ చూపుపాపనై ♦ నే నటిస్తాను.

*    *    *

ఎడబాట్లుకలిగేటి ♦ యెండకాలమున
ననువీడక కృశించు ♦ ననరాణియెవతె?
నా వేణువును కరు ♦ ణార్ద్రగానూది
అప్పగింతలుపాడు ♦ నార్ద్రికాలమున
ఎల్లెడ కారాకు ♦ లల్లాడువేళ
అంటియుంటా రెవ్వ ♦ రవుసు నాదండ.

*    *    *

గన్నేరుమొగ్గనే ♦ గరువాలగడ్డ!
నిన్ను మోహించాను ♦ నిండామనసార
నీదు కౌగిట నన్ను ♦ నిలువనిమ్మోయి
నీశయ్య నన్ను రా ♦ జింపనిమ్మోయి
నీనవ్వు చల్వలో ♦ నాననిమ్మోయి
నీలాలనసుఖాన ♦ సోలనిమ్మోయి.
నేను వస్తానోయి ♦ నేను వస్తాను
వచ్చి నీవెనువెంట ♦ వలచియుంటాను.

*    *    *

మందారమును నేను ♦ మాధ్వీపిపాసి
నీదు వచ్చునిరూపు ♦ నేకోరినాను
ఏకిన్నరస్వరాన ♦ ఎలుగెత్తి మమ్ము

పిలిచితో ఆముద్దు ♦ పిలుపులోపలనె
కలదు నీదువియోగ ♦ గద్గదస్వరమె.
నేనెఱుంగుదునోయి ♦ నీరహస్యములు.

* * *

+ ఎందుకో ఆలస్య ♦ మెందుకో అలత
ఎందుకో సందేహ ♦ మెందుకో కొఅత
అందుకోవోయి! మో ♦ హనసూత్రధారి
నా ప్రేమపూస లం ♦ దపుదంపుగట్టి.



# శుక్తి




వాఙ్మయము మహోదధింబడి ప్రాకులాడు
దహరహము నేను; శ్రాంతి విశ్రాంతిగాఁగ
తారకలు చూపిన దిశాపథంబుఁ బట్టి
రాగిణులు[1] కాళ్లయందెల రవళి నెనసి.

*　　　　*　　　　*

నీరదములు నర్తించిన దారులంది
కాలఖేలన మొందెందుఁ గలయఁద్రిప్పి
నందు నందెల్లఁ బారవశ్యమునఁ బోదు
పరిమళము త్రిప్పు తుమ్మెదబాలలీల.

*　　　　*　　　　*

లేదు లేదు నిర్బంధపాలిత పథంబు
నా సువర్ణతరణికీ విలాసమణికి.

*　　　　*　　　　*

ఒక్కవీచి ముంపఁగ మఱియొక్కవీచి
తేల్పఁగ, నగాధ పాతాళ తిమిరమొక్క-
మాఁ అపారనభం బొక్కమాఱుఁజూతు
పగలు రేలు పాటించెడి ప్రాణిపోల్కి.

*　　　　*　　　　*

కాటియందలి ధూమాంధకారభరము,
పడకటింటి కర్పూర దీపపు మెఱుంగు,

---

1 గాన పక్షమందు రాగశబ్దము స్త్రీవాచకము

నొక్కగతిని నానావకు దిక్కుఁ దెలుపు
లేదు వ్యక్తికి ఛాయావిభేదమతము.

*　　　　*　　　　*

పోయిపోయి సంపాదింపనాయె నాకు,
ఒక్క శ్రావణ రజనీ వియోగవేళ
చినుకువన్నెల ముత్యపుఁ జిప్పయొకటి
తొలగిపోని తారకలె యిందులకు సాక్షి.

*　　　　*　　　　*

కడల కరడులు కరడులై వెడలుచుండె
మధుర జలధరపంక్తులు,—మాతృగర్భ
కుహారమునువీడు ప్రేమ పంక్తులవిధాన
మోదమును రామణీయము నందఁ బ్రకృతి.

*　　　　*　　　　*

లసదుషఃకంఠధవళమాలలు గనఁబడె
నెలలబాలెంత స్తన్యధారలవిధాన,
భావరేఖయుఁ గుటిలకంపనము మాని
సుప్తవిరహిణి భ్రూలతాక్షోభఁ బోలి.

*　　　　*　　　　*

ఆమధురశక్తిహస్తము నందగింప
కడలియొడ్డెక్కితిని;—కాని గాననైతి

కలయ వెదకియు వందెందు దొలుత నేను
దిగినసన్నపురేఁ వేమి దృగ్భ్రమంబో?

* * *

తీరమునకుమాఱొడ్డి యుద్భిన్నములయి
క్షుభితకల్లోలగతిఁ గొట్టికొనెడి యలల
గాఢకోలాహలంబింత గానరాదు
మెత్తని యిసుకపడకల నొత్తిగిల్లి.

* * *

అతివిశాల, మతిస్నిగ్ధ, మతిమనోజ్ఞ
మయిన యాతీరసికతాపథాంచలమున,
ఒకనియడుగులజాడ, వేరొకఁడువచ్చు
వఱకె నిలదు పారావారపాలనమున.

* * *

లేచిపడి నశించిన ప్రతివీచియందు
నుదయమందు వేఱొకనూత్నముదితవీచి
చెఱఁగిపోయిన ప్రతిపాంథుచరణచిహ్న
ములను వేఱొకనికి శుద్ధతలముదొరకు.

* * *

ఆవిలాసము నాహృదయము హరించె
రజనిసంధ్యాకషాయ చిత్రమునుబోలె,

తిరుగుదింక, స్వచ్ఛందసుందరవిపంచి
కాలతావశమగు స్వరగతివిధాన.

*　　　*　　　*

ఏను దెచ్చిన మృదుశుక్తిలోని జాతి
ముత్యములను లోకముముందుఁ బోయువాఁడ
హృద్యమై యొప్పువానిని నేఁకొనుఁడు
అభిరుచికొలంది రౌద్రసౌమ్యముల నరసి.

*　　　*　　　*

సొగసుహృదయము సుకుమార సుమముబోలె
చేతి కందించువాఁడ రసికజనులకు!
కంఠమాలల ధరియింత్రొ గారవమున
రేకులనుఁజించి యావల పాఱేయునొంత్రొ!

*　　　*　　　*

రుచిచకితమైన హృదయసరోజగర్భ
మందుఁ గందళించిన భావ మంద మొంది;
వాణికై యెప్డు వెలువడు వదనమందు
అపుడె సుకవికి స్వాధీనమయ్యెఁ గవిత.

# వసంతవికాసము

౧



తరుణ కుసుమశిఖా సూత్రధారివగుచు
ముదురు లేఁతల భేదము లొదవనీక
నిఖిల తరుజగతికిని నందించినావు
సహృదయానందరాగ రంజనము చైత్ర!

౨

కలికికోయిల గొంతులో మొలకగీతి,
సోయగపుఁ బూలపొత్తులఁ దీయతేనె,
పోసితో యెప్పు డప్పుడే పులకరించె
నాహృదయశయ్య కవితోపగూహనమున.

౩

కొమ్మ కొమ్మన, నాకు నాకున నలంది,
పూవు పూవునఁ, జివురు చివురునఁ జిందఁ
జిలికితివి నూత్నచైత్ర కాశ్మీరరుచులు
పుడమి నవకమ్మునకు వన్నెలిడ వసంత!

౪

మోళ్ళుమోసెత్త నిల మూలమూలలందు
నందమొగఁబోయు చైత్రుని యాగడముల
కీడ్వఁబడి మేలిముసు గింత యెత్తె గగన
భామ, తనకన్నతపసెల్ల భంగపడఁగ.

౫

మోదమున మోజుపడి కుసుంభాదుకూల
మందగించిన యువని నానందబద్ధ
నయనములఁ జూచి చూచి యున్మాదియయ్యె
మధుతపస్వి కింకేభావికథమొ నడవ?

౬

పొదలవాకిండ్లు తెఱచి యాపువ్వుపుత్త్రి
కలను, నూతనావిర్భావ కోమలాస్థ
రేకు లెత్తించె స్వచ్ఛంద ప్రియుఁడు చైత్రు
డార్ద్రరాగాంకితలు నల్లి యవనిమీఁద.

౭

ఏమిటికిఁ బొంచిపొంచి లాలించెదోయి!
జాళి బాల గులాబీల జాలిమాలి,
మొగము లెత్తవు; లజ్జచే వలపుమొలక
దాటిరాలేక రెప్పల దాఁగులాఁగు.

౮

చక్కని నభంబు రంగులఁ బిక్కటిల్లె
నిండుజవ్వని యారుణంపు గండమ్ములు,
రాగగీతులఁ జెలరేగ భోగపవనుఁ
డప్సరసల నృత్యోత్సవ లిప్సలీల.

౯

వీథికడపటి వ్యాకుల వేణుకుంజ
మాలపించె హ్లాద మనోజ్ఞమయిన పాట,
కోమలసమీరుఁ డాడించు కులుకుకొమ్మ
ఱెమ్మలనుగూడ గానమే రేకులెత్తె.

౧౦

పవను నడుగుల రవళికిఁ బట్టికెరలి
కెవ్వుకెవ్వన నవ్వు పక్షినిచయంబు,
తల్లిపాలకువ నాలించి దాదికోలఁ
గిలకిలల మేలుకొను బాలికలవిధాన.

౧౧

పత్రవస్త్రాపహరణ విచిత్రుఁడయిన
శిశిరు వివృతవిజిజ్ఞాస నీదరించి,
చిగురుచెంగావి కోకలిచ్చితివి శుభవ
నీమతల్లుల సంవృతనీతి నెఱిఁగి.

౧౨

మొగలిరేకుల మును వర్షపుత్రకుండు
వ్రాసిన శుభాక్షరంబులు మాసిపోవె,
అధరరేఖవంటి కషాయ మధురపల్ల
వమున నీవైన చెరఁగని పంక్తి నిలుపు.

౧౩

ఏదెసను బ్రేంచితి జగంబు నేమరించి
మధురగీతా సరసిగట్లు మధుపిపాసి!
అఖిల మానందసుఖసుప్త మయ్యె నింక
మేలుకొలుపు వైతాళిక లేఁ రారు!

౧౪

తేనెఁ దిని నర్తనాసక్తిఁ దిరుగు నళులు
పాయలై పాయలై గానఁబడియెఁ గడల,
స్నానగంధవాసనలు సాంద్రముగఁ బెరయ
నాఁడవిడచిన మధులక్ష్మి యలకలనఁగ.

౧౫

ఇగురుమావులఁ గోకకోయిలల లేపి,
మినమినలపూల చెఱఁగులఁ బసపుఁబూసి,
పచ్చివలపుకాకల నెఱ్ఱపడిన రాగ
సరళిఁ బాడించెదు వసంత! జగతిచేత.

౧౬

సమదపికములు పాడు స్వచ్ఛందగీతి,
దక్షిణసమీరుఁడేగు స్వతంత్రవీథి,
స్వేచ్ఛగాఁ బూచె మంగళగుచ్ఛలతలు,
జగతినేల నూత్నప్రాణ మెగయదింక.

౧౭

సుఖనిశీథము, గీతికాముఖరపథము,
సరసపవనము, సుమదళచకితవనము,
పెనఁగి నిలువంగనీయవు మనసులోని
ప్రియగతులఁ గంఠముఖమునఁ బెకలకుండ!.

౧౮

చచ్చిపోవు కారాకుల స్థానములను
చిగురుచేవలు మొలుచు సౌష్ఠవముగనుచు,
మృత్యువునకేలో భీతివహింత్రు జనులు
అవల స్వచ్ఛందసౌందర్య మబ్బుచుండ.

# శేషచైత్రము



రుగు పుట్టిండ్లలో ♦ నెదిగిన మెలమి
కొమ్మల యొదలలోఁ ♦ గులికిన కలిమి
మృదువనస్పతులలో ♦ మలగిన చెలిమి
వైశాఖమును జూచి ♦ వదలదే చైత్ర!

౨

పూల కౌగిండ్లలో ♦ నోలలాడితివి
సరసుల పొత్తులో ♦ సఖ్య మాడితివి
పసిపైరగాలిలో ♦ పరువు లాడితివి
మండుటెండల సవి ♦ మానదే చైత్ర!

౩

రమణుల చరణాల ♦ గాచిన లాక్ష,
అబలల యధరాల ♦ నంటిన తమ్మ,
కన్నెల నుదురుల ♦ కందిన చాదు
ఎన్నాళ్ళ మురిపెమో ♦ నెఱుఁగుదే చైత్ర!

౪

కోయిల పాటలోఁ ♦ గోమల స్వరము
మలయమారుతములో ♦ మధురవాసనలు
కలికి పూగుత్తిలోఁ ♦ గమ్మని మధువు
అనుభవించెందాక ♦ నందాల చైత్ర!

౫

పత్రాలు రాల్చితి ♦ పచ్చనిచెట్ల
జీవనక్షామమ్ముఁ ♦ జేర్చితి నదుల,
పనిపాట లావల ♦ బంపితి విండ్ల,
చాలదే నీపాలి ♦ జయమింకఁ జైత్ర!

౬

మధుపాతమున భూమి ♦ మురపించినావు
సుఖరక్తిఁ బ్రజలను ♦ పాలించినావు
పగలు దీర్ఘములుగాఁ ♦ బాటించినావు
చాలవే యీనాళ్ళు ♦ చక్కని చైత్ర!

౭

కష్టమో సౌఖ్యమో ♦ గడపితి విచట
నీ మంచి కాలంబు ♦ నీటుగో౯ వెగయు
దుఃఖింప కవసాన ♦ దురవస్థ కిపుడు
కాలచక్రము నాప ♦ గా లేము చైత్ర!

౮

నవనవ లాడేటి ♦ చివురాకులెల్ల
కఱకెక్కె నెండ కా ♦ కలుబోతె ముదిరి,
సవ్యవాతములు దు ♦ స్సహములై రేగ
నిప్పులు గ్రక్కుచు, ♦ నరుష్యంపు చైత్ర!

౯

నీ సౌఖ్యసంపదల్ ♦ నీ భోగరుచులు,
గ్రీష్మున కిట్టు ల ♦ ర్పింపఁగా వలసె
నంచు నాకులపడ ♦ కవసాన చైత్ర!
ఉదయాస్తమయతత్వ ♦ మిదియె సు మ్మిలను!



## ౯ పూవు

౧




లియల సిగలలోఁ ♦ జాలువారు పూవ
పడతుల జడలపై ♦ బవళించు పూవ
సఖుల ముచ్చటముళ్ళ ♦ సవరించు పూవ
లలనావతంసమ్ము ♦ లను గుల్కు పూవ
పోవకే! మాతల్లి ♦ పూజకో పూవ!

౨

అలవిచ్చి సిగ్గులఁ ♦ గరఁగేటి పూవ
మొగ్గవై మోజులఁ ♦ మొలిపించు పూవ
పూచి శోభనములఁ ♦ బొదివిన పూవ
దళముల కౌఁగిలిం ♦ తలఁజొక్కు పూవ
పోవకే! మాతల్లి ♦ పూజకో పూవ!

౩

చిగురాకు మరుఁగునఁ ♦ జెలువారు పూవ
కొమ్మలసందిళ్ళ ♦ గొనలెత్తు పూవ
ఎండకు కాగని ♦ మెలపూత పూవ
వెన్నలఁ పేరని ♦ వెలుతురు పూవ
పోవకే! మాతల్లి ♦ పూజ కోపూవ!

౪

కడుపులో తేనెలు ♦ కల కన్నపూవ
తనువున గంధాలు ♦ దయివారు పూవ

రెక్కల సందాలు ♦ గ్రక్కేటి పూవ
మోమున లావణ్య ♦ ములు రాలు పూవ
పోవటే! మాతల్లి ♦ పూజ కోపూవ!

౫

పసుపు కేసరములతో ♦ మిసిమించు పూవ
నిగనిగ సొగసులతో ♦ బిగివోని పూవ
పెండ్లింట్లపాలించు ♦ ప్రేమంపు పూవ
వీరుని కంఠాన ♦ విప్పారు పూవ
పోవటే! మాతల్లి ♦ పూజ కోపూవ!

౬

కాపుకన్నియ కొప్పు ♦ కైసేయు పూవ
ఉపవనాల నుయాల ♦ లూగేటి పూవ
తోటకంచెల వన్నె ♦ తోంబూచు పూవ
అడవిడొంకల నంద ♦ మయిమెప్పు పూవ
పోవటే! మాతల్లి ♦ పూజ కోపూవ!

౭

సెలయేటి పాటతో ♦ జెవియొగ్గు పూవ
తుమ్మెద సఖులతో ♦ తుల్లిళ్లేటి పూవ
పైరగాలికి విచ్చి ♦ వర్ధిల్లు పూవ
రంగుల రాశివై ♦ రాణించు పూవ
పోవటే! మాతల్లి ♦ పూజ కోపూవ!

౯

కళలకళ్యాణివే ♦ కమ్మని పూవ
సౌందర్యసరసివే ♦ చక్కనిపూవ
భావాలబరిణవే ♦ బంగారు పూవ
చిన్నెలచిలుకవే ♦ సింగారి పూవ
పోవటే! మాతల్లి ♦ పూజ కోపూవ!

౧౦

పెరిఁగినా! తరిగినా! ♦ ప్రియమేనె పూవ
చచ్చినా! బ్రిదికినా! ♦ స్వర్గమే పూవ
ఓడినా! గెలిచినా! ♦ యొప్పేనె పూవ
తొలఁగినా! కలసినా! ♦ తోడేనె పూవ
పోదాము! ఆతల్లి ♦ పూజకే పూవ!

శమీ శమయతే పాపమ్। శమీ శత్రువినాశనీ
అర్జునస్య ధనుర్ధారీ। రామస్య ప్రియదర్శనమ్.



కృష్ణవేణీహరితసస్య ♦ పృథివియందు
ఖ్యాతమీపుణ్య కళ్యాణ ♦ కంఠసీమ
తుంగభద్రాశుభోపాంత ♦ రంగములను
అందికొనుము శమీలక్ష్మి! ♦ యాంధ్రపూజ.

శమీ పూజ.

# పూజ

౧

చందమామ పూవెన్నెలల్ ♦ జల్లులాడ
చేళ్ళు పులకరింపఁగ సెల ♦ యేళ్ళు పాడ
విశ్వమునఁ బచ్చతోరణాల్ ♦ విరిసియాడ
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౨

తెదరుతేళ్ళను వెరపేది ♦ పొదలు వెడల
చిన్ని మొక్కలు సైతము ♦ చేవ గ్రక్క
జీర్ణ మురళియు మ్రోగను ♦ జీవరుతుల
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౩

పొంగిపొడిచిన నదులెల్ల ♦ క్రుంగఁ జూచి
ఆకసముఁ బ్రాకు వరదగూ ♦ ళ్ళణఁగ గాంచి
త్రుళ్ళి త్రోపాడు మేఘముల్ ♦ తొలఁగ నరసి
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౪

సస్యములకుఁ బాలిచ్చు వా ♦ త్సల్యవతులు
మంగళతరంగిణులు, ధీర ♦ భంగి చెప్ప
నాలకించితి భావర ♦ హస్యములను
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౫

చెరగిపోని చక్కని లిపిఁ ♦ జెక్కినారు
తాల భాగ్యభారత శాస ♦ నాల ఋషులు
వానదెబ్బల తుప్పడు ♦ వాసె, చదివి
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౬

తెలుఁగునెత్తుట వెలిగిన ♦ దీపకళలు
తెలుఁగుపాలఁ బేరిన మీగ ♦ డల తరకలు
తెలుఁగుతేన తీయందన ♦ మ్ములను దనిసి
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౭

భక్తుఁ డొక విగ్రహము తల ♦ పయిననుంచ
వీరుఁ డొక ఆయుధము మీఁద ♦ బెట్టి గొలువ
కర్షకుం డొక కాడికిఁ ♦ గట్టి మ్రొక్క
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౮

కన్నె పసుపచ్చలెలు సల్ల ♦ గౌరిపేర,
దేవిపేర కుంకుమను శా ♦ క్తేయులీదు,
విప్రులు సరస్వతీదీక్ష ♦ విరులొసంగ,
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౯

కవులు కవితామధువుచే జ • గమ్ముఁ దడుప,
శిల్పకులు కుంచియలఁ దేట • తెలుపు దిద్ద,
గాయకులు గాత్రరక్తి రా • గములనెత్త
వ్రేలవే! తల్లిమెడను పూ • జాలలంతి!

౧౦

పంజరములోని చిలుకల • పాటలందు,
అడవిలోని గోర్వంకల • నుడులయందు,
ఒక్కటే శ్రుతిచెదరక • పిక్కటిల్లె
వ్రేలవే!తల్లిమెడనుపూ • జాలలంతి!

# * విరహవీధి



హేమపాత్రల చందన ♦ మెండిపోయె
ద్వారములు మోయుచున్నవి ♦ హారములను
సానలం దించె స్నానక ♦ షాయగంధ
మబల ! యెవనికోసము నగ ♦ మయి కృశింతు.

గీ. చెక్కుచెదరని పాపట ♦ చిక్కువడియె
వేణిబంధము శిథిలమై ♦ పిరుఁదులంటె
కరఁగి చెరగిన తిలక రే ♦ ఖలను దుడువ
వతివ! యెవఁడాహరించె నీ ♦ యార్ద్రహృదిని.

గీ. పాలుపొంగినగతి పొంగు ♦ ప్రణయరక్తి
నాపుకొనలేని పడుచు ప్రా ♦ యంబుతోడ
నమ్మి యెవనికి నీమన ♦ మమ్మికొంటి
వువిద! యీమేఘమాస న ♦ వోదయముల.



# పిలుపు



నిశలు పులకించెఁ గనులకు నిదుర రాదు
పైదలి! యేమిటికి నన్ను బాధపెట్ట?
ఏపొదలదాగి పాడె దీ హృదయవిదళన
దారుణములైన నగ్నగీతమ్ము లెత్తి. ౧

నావిరహగంధగీతి కన్వయముఁ జెప్ప
శిరసు లెత్తుచు నున్నవి చిగురుపొదలు,
నవ్వుచున్నది కడల నందంపుసందె
కావిరంగుల రంగైన మోవివిరిచి. ౨

కొసరియాకుంబసపు చెఱఁగులనులాగు
గంధవహుని కౌఁగిటనుండి కరుణవడము
లల్లుచున్నది స్రుతులఁ బ్రాయంపువంశి
నాహృదయ వేదనాలాపనములఁ గరఁగి. ౩

వలపు పచ్చనిదని రక్తిమొలవఁబాడి,
విరహ మరుణమని యెద తపించ విసివి,
చెలిమి నల్లనిదని విరసింతు విపుడు
ప్రేమ ధవళిమమని యింక వినుతు వెపుడు! ౪





# మధుమాలి

ఆకసమ్మునఁ బూవులే యందగించె,
వసుధకడుపునఁ బూవులే పవ్వళించె,
ఆలయమ్మునఁ బూవులే యాటలాడె,
ఏలపాడదు తుమ్మెద పూలపాట. ౧

పవనుకౌఁగిటఁ బూవులే సవదరించె
హృదయమందునఁ బూవులే రేకులెత్తె;
తోఁటలోపలఁ బూవులే తొలకరించె,
ఏలపాడదు తుమ్మెద పూలపాట. ౨

ఎన్నియెన్ని భవంబుల నేమియేమి
పూజలను జేసి పట్టితీ పూలనోము!
చైత్రు సహవాససుఖము లేచాయ నబ్బె
తేటసేయుము తుమ్మెదా! పాటఁబాడి. ౩

## తుమ్మెద.

కష్టములను శారదచంద్రికలవిధాన,
దుఃఖములను తొల్కరివానతునుకలట్లు,
లనుభవించితి,—చిత్త మాహ్లాదపులక
వివశమయి సేయునృత్యముం విడువకుండ. ౪

స్తన్యభరశీతలంబైన జననియొడిని,
పరిమళప్రగాఢమగు భావపాన్పునందు,

వేదబుఖ్యాతమగు యజ్ఞవేదిమీఁద
నెలమి—నాదుకౌమారమే నిలిపికొంటి. ౫

ఆటలాడితి వెన్నెల యలలపోల్కి,
పాటలనుబాడితిని సెలయేటిపగిది,
సంకెలలు కాళ్ళయందెల చాయఁగొంటి,
అన్నిటను—బాల్యలీలలే యనుభవించి. ౬

పాటలు తలాడఁగాఁగని పవ్వళించి,
పాటలను జెలికత్తెలభాతిఁ బిలిచి,
పాటలే జీవయాత్రకుఁ బథముఁజూప
వచ్చితిని, యింపకమ్మలపాటతోడ. ౭

ఇంతకన్నను నోములే నితర మెఱుఁగ,
ఈశ్వరుఁ డనుగ్రహించె నాకీ భవంబు.
నవ్వుచును బుట్టె, నవ్వుచు నవక మొందె,
నవ్వుచునుబోదు—నిదియె నానగ్నలీల. ౮

పాంథుఁడు.

మధుప! యేటికీ చంచలపథముఁ గొంటి
పొక్కపువునకుఁ బెట్టెదు 'చక్కిలింత'
లొక్కపువునఁ బానియముఁ గ్రుక్కగొందు
వొక్కపూవును గీతితో నుత్సవింతు. ౯

అంతులేనియాకసమునఁ గొంతిసేపు,
కుటిలపవనవీచికలందుఁ గొంతసేపు,

కువలయోన్మీలరేఖలఁ గొంతసేపు,
త్రుళ్లిపడుచుఁ దిరిగెదు మత్తునివిధాన. ౧౦

### తుమ్మెద.

చంచలుఁడ వౌదు నవనికిఁ జలనమొసఁగ,
విరహినగుదు శంపికృతులకు వేడిదార్ప,
మత్తుఁడనగుదు జతలకు మత్తువెట్ట,
లేదులే దనృతం బిందు లేశమయిన. ౧౧

† ఒక్కపువుపొంత నాడుదు, నొక్కపూవు
పజ్జఁబాడుదు, నొకపూవుసెజ్జమీద
శిశువువలె నిదురింతు నీ చిత్రదశల
చక్కదనములు లేక నా జన్మమేల? ౧౨

చిత్తచాంచల్యమన్నను సిగ్గులేదు
మతిభ్రమణమనినను నవమానపడను,
నన్ను నాపూలనెడఁదీసి భిన్నభిన్న
మార్గముల కీడ్వకున్న నమస్కరింతు. ౧౩

తారలన్నను, మణులన్న, తనయులన్న
పులుఁగులన్న, గీతములన్న, పూవులన్న
నామవాచక భేదముల్ నాకుమాత్ర
మన్నియును బూవులేయగు నార్ద్రదృష్టి. ౧౪

పూలకొఱకయి పుట్టితి, పూలలోని
తియతేనెను దీయుచుఁ దిరుగువాఁడ,

నెపుడు నాడుచుఁ బాడుచు నిదియె—నిజము,
భ్రమయొ; యున్మాదమో; క్రైపొ; వలపొ; సొలపొ! ౧౭

ఈమధువ్రతమును తుదకెల్లజరిపి
వదలుదును తేనె పెరలతోఁబాటు పృథివిఁ
బిదప నరయుఁడు చంచలహృదయుఁడంచు
లోకగీతిసంగ్రహమును బ్రీతితోడ. ౧౮

ప్రేమచేఁ జెమ్మగిల్లిన హృదయరాగ
ములను నడిపింప కాల్వ లెందులకుత్రవ్వ?
నడువనిమ్ము నచ్చినభంగి నొడువులోలయు
వాలకముతో నెడాపెఁ వాఁకలట్లు. ౧౯

# గీతాం దేహి

## ౧



కన్యా మీరాబాయి.

ఇంత తపించెద ♦ వేమిటి కింతీ!
కాంతి విరహమున ♦ కగ్గి కృశింప
వలపులువాడిన ♦ ఫలమేమిగలదు
వాసనవోయిన ♦ ప్రసవము శేల.

ప్రేయసివని నడి ♦ రేయి నేతెంచి
వాకిట నిలచినఁ ♦ బలుకకపోతి !

సందెకడల నిండు ♦ సందెపు కురులు
దువ్వుకొనుచునున్న ♦ మువ్వపు సొగసు
చూచిచూచి సకియా! ♦ సోలినమనసు
ఆపఁజాలక విర ♦ హంబున వెడలి.

మెల్లమెల్లన నును ♦ పిల్లనగ్రోవి
వాయించినాను నీ ♦ వాకిలిముందు
చూడవైతివి నను ♦ సుందరి యపుడు
కడగన్నుల రాగ ♦ కళికలు గురియ.

చెదరిన పయ్యెద ♦ చెంగులు గనక
చెమరించు చెక్కుల ♦ చేష్టలు గనక
ఉయ్యాల లూచెడి ♦ యుత్తమవేళ
శయ్యలు సవరించు ♦ తియ్యనివేళ.

నీహృదయము కరు ♦ ణించునో యనుచు
నీరాగములు రవ ♦ ళించునో యనుచు
అలత "గీతాందేహి" ♦ యని పాడినాఁడ
"ధన్య మీరా"యని ♦ తలపించినాఁడ.

నాగర * గురుచర ♦ ణంబుల మఱఁగి
లోకాపవాద వి ♦ లోలత కడలి
ననుజూడ లజ్జించి ♦ తనుపమగాత్రి!
ననుఁగూడఁగ నను ♦ మానము పడితి.



## దాసీక్షేమ.

సాధింపులేలోయి ♦ సాహసకాఁడ!
ఈదీనురాలితో ♦ నేమి వాదాడ
నీరూపురేకల ♦ నెమ్మది వలచి
ఎన్నివెన్నెలరేల ♦ నీడ్చితి వగల.

మబ్బులు గ్రమ్మిన ♦ మాపులయందు
పులుగులు పాడిన ♦ తొలిజాములను
నీనీడలే భ్రమ ♦ లోన నీక్షించి
నీయడుగులజాడ ♦ నే యాలకించి.

నడిరేయి యనకయె ♦ నకనక పడుచు
పడకటింటితలుపుల్ ♦ ఫక్కున తెఱచి

---

* నాగరుఁడను తాపసి మీరాబాయి గురువు

త్రుళ్ళుచు నటునిటు ♦ త్రోవలు సూచి
యడియాసపాలయి ♦ యారడి కడలి.

అందెలు మ్రోగునో ♦ యని జంకిజంకి
కుచ్చెళ్ళ పెళపెళ ♦ కును క్రుంగిక్రుంగి
సిగ్గున మ్రగ్గుచు ♦ జింతఁ గమలుచు
ఎన్నెన్నిసారులు ♦ చిన్నవోయితిని.

మీరాబాయి, క్షేమ—వీరు ఉత్తర హిందూస్థానపు భక్తురాండ్రు. వీరు పాడిన గీతములు భక్తిపరవశములుగ గానము చేయబడుచున్నవి. ఈపై రెండుపాటలును హిందీపదములకు యథానువాదములు.

మీరాబాయి

నీతిమాలిన దని ♦ నిందించెదరు
జాతిజాఱిన దని ♦ శాసించెదరు,
సిగ్గువీడిన దని ♦ చిన్నమాటాడి
పరవశురాలని ♦ పాపముల్ పలికి,
వీధులఁ బోవఁగ ♦ వేలెత్తి చూపి
నొవ్వఁజేసిరి నా ♦ మవ్వపు మనసు
విసపు గిన్నియ నా ♦ పెదవినిఁజేర్చి!
కసిదీర్చుము "నా ♦ గర" గురుమాళీ!





మదవతుల మోములను చంద • మామసోబగు
అందెరవళుల నందంపు • హంసఘలుకు
కెంబెదవుల బంధూక ర • క్తిమయు విడచి
సుభగశారదరమ యెందో • సురిగిపోవు.

శరదృతువు.

# ప్రవాసరాధిక

చ. చదలు పయోదమాలికల ♦ శ్యామలమయ్యె దమాలపంక్తులన్
కొదమవనమ్ము చీకటులఁ ♦ దన్ నెలవయ్యెఁ, గుమారభీరుఁడీ
యదుసుతుఁ డిల్లుఁజేర్పు మని ♦ యాడెడినందని దేశ మాలకిం
చి వెసలుసూచుచుంజనియె ♦ స్నేహతపస్విని రాధయొంటిమై.

మ. కడలం గాల్నడ నేగు త్రోవరుల సై ♦ గల్ గానఁగా రావు, చే
పెడు పాలిండ్లరుచుల్ మరుల్ గొలుపగో ♦ బృందమ్ముపోలేము, పెం
పుడు లేళ్లైనఁ గదంబకుంజముల దా ♦ పుంజేర పీసంజరా
యుడి పిఛ్ఛీముఖమందు నెందలసితో ♦ యీ! ముగ్ధగోపాలకా

గీ. చెదరివిరిసిన యాఁబెయ్య ♦ కదుపులెల్ల
మందఁ గొనఁగ నాకర్షించు ♦ సుందరాను
రాగ రాగగీతికలైన ♦ రావు కృష్ణ!
యెంతచెవియొగ్గివినిన నీ ♦ ప్రాంతమందు.

ఉ. పచ్చనియాకుజొంపముల ♦ పైఁబడు నందపుసందెవన్నియల్
విచ్చిననీసిగన్ ప్రతిఫ ♦ లించిన మించులునేని దోఁప వీ
ముచ్చటయైనతోఁపున వి ♦ ముగ్ధుఁడ! దట్టపు చెట్లనీడలం
జొచ్చితొ? యల్లికొన్నసోగ ♦ సుంబొదలంగనుచాటులైతివో!

చ. పొనపొనబూలపిండికణ ♦ ముల్ కణముల్ దొరలంగప్రాతమో
చిన మెలదీవయిండ్లకడఁ ♦ జిక్కని నీ చరణాంక రేఖకల్

గనఁబడ, వార్ద్ర దర్భలు స◆గమ్ము సగమ్ము గ్రసించు చావలన్
జనిన కురంగపుత్రికలు ◆ సైతము చూపవు నీదుజాడలన్.

ఉ. పాదములొత్తుకో నిసుక ◆ వాగుల రేవుల కాలఁద్రిప్పి యా
యాదరులం బ్రదోషసమ◆యా ప్రియరాగములాలపించు వే
ణూదయభాగ్యమెందఁగ◆నోయి? కుమారయశస్వి! పల్లవ
స్వేదములైక అంగిన స◆సిన్ వెలయింపవు పో వనస్పతుల్.






# సఖీసంవరణం

(రవీంద్రమహాకవి పదావళినుండి తెనిగింపఁబడినది)

తనింతలె నాడు ♦ కాంతుని వగలు
సెగలయి నాయెద ♦ తెగ దహియించు
కనికర మెఱుఁగఁడె ♦ కపట నాటకుఁడె
ఆడుదాని రహస్య ♦ మూరయలేడె

అబలల కతిథిగా ♦ నరుదెంచు ప్రియుడు
సందెలు గ్రుంకక ♦ ముందేలరాఁడో?
చీరగట్టక మెయి ♦ సింగారములు
సవరింపక పూల ♦ సరులు ముడువక
ప్రాలుమాలికతోఁ ♦ బవళించియుండ
బిరబిర వచ్చునె ♦ ప్రియవల్లభుఁడు
ఏమని వలదంచు ♦ నా మోహానుని
కాదని వల్లెత్తి ♦ వాదాడలేనె;

దినమంతయు తఱి ♦ తీపితోఁగడపి
సందెలఁ బిలుచుచు ♦ సఖులను బంపి;
నగలు పెట్టుకొని యం ♦ దమ్ములు దిద్ది
సన్నపావడ సాగ ♦ సారగఁ గట్టి
కర్పూరపు దీపి ♦ కలు వెలిగించి
పరిమళములు చిమ్మి ♦ పాన్పు లమర్చి
పన్నీరొలికెడి ♦ పందిలిచాయ
రాయంచలాడున ♦ రస్సులకెలన

వీణతంతుల నాల ♦ పించుచుఁ గొంత
వేణుగీతల వల ♦ పించుచుఁ గొంత
తనకోసము విరాళి ♦ తాళఁగలేక
ప్రణయవేగము మది ♦ భరియింపలేక
జేలతనంబున ♦ వేచిననాఁడు
నాచాయ రాఁడేమి ♦నా నాయకుఁడు
నన్నుఁజూచుచు వద ♦ నం బటు త్రిప్పి
తొలఁగిపోవును "చీర ♦ తోడే" చెలియ!
సైపఁజాలక తమి ♦ దీపము దీసి
శయనింపఁబోయెడు ♦ సమయమునందు
చోటిమ్మని సోలు ♦ చును వచ్చు సఖిరో!
లేదని పల్లెత్తు ♦ లేనపుడైన
వాకిటి పొంత నా ♦ వల్లభుఁడుండ
చూచి ఓపగలేదె ♦ సుదతి నామనసు.

* * *

తోడివారలు నేను ♦ త్రుళ్లుచునుండ
పెడత్రోవల తాను ♦ నడుచునె ప్రియుఁడు
వంచిన మొగమెత్తి ♦ కాంచఁడె యొరుల!
పరితాప మించుక ♦ పలుకఁడె హితుఁడు.
నాథుని చేష్టల ♦ నామదిఁజూచి
ఆనందమే మిథ్య ♦ యని తలపోతు.

ఒక్కొక్కమాఱు వి ◆ యోగపు వగల
హృదయ మింతింతలై ◆ చెదరి తపింప;
తీయని ప్రేమను ◆ దోయిలిఁబట్టి
ఆసపెట్టిన యడి ◆ యాసకు మ్రొక్కి;

"అబలల హృదయము ◆ లధివసియించి
పరిపాలించు నో ◆ ప్రణయతపస్వి!
పడులఁ ప్రేమించుట ◆ పాపము సుమ్మి!
అంతకన్నను కష్ట ◆ మవనిని లేదు.

జగముల నేలెడి ◆ సర్వమయుఁడవు
సొగసులఁ గరగెడి ◆ సుందరాంగుఁడవు
ఆనందసాగర ◆ మం దందమయిన
గడుసుబంగరు నావ ◆ నడుపఁగలేవె?
అన్నెముపున్నెము ◆ నారయలేని
ఈయబలల భ్రమి ◆ యింపగనేల?
నీవునీవని లాల ◆ నీయపుగతుల
నమ్మువారిని వగ ◆ కమ్మఁగనేల?
ఈయాండుంబుట్టు ◆ వికనాకుఁ జాలు
పూలదండఁగ నను ◆ బుట్టింపవోయి!
తమ్మిపూవుగ నను ◆ దయజూడవోయి!
కనకచేలముగ నన్ ◆ గరుణింపవోయి!"

అని తలపోసెడి ◆ యర్ధరాత్రముల
విసివి వేసారిన ◆ విసమపు నిశల

ప్రాణముపైఁ గాంక్ష ♦ వదలినవేళ,
ప్రేమపైన విరక్తి ♦ ప్రామినయెడల,
కిలకిల నవ్వుచు ♦ కేళీనిరతి
నందగాడై చెల్వ ♦ చిందెడు వగల
ననుడాయగవచ్చి ♦ నానిద్ర లేపి
నను పరవశఁజేయు ♦ నానాగతుల;
తహతహఁదార్చు వి ♦ రహబాధలెల్ల
అప్పు డసత్యము ♦ లని యెంచికొందు.

* * *

ఎన్నితిప్పలు పెట్టి ♦ యెంత వేచినను
ఎడబాయఁజాల దీ ♦ హృదయం బతని
పలుభవముల యందు ♦ పలువేసములను
ననుగరగించిన ♦ నాయకుఁ డితఁడె,
అభిమాన మెడలిన ♦ నవమానమయిన,
అఖిలలోకమ్ములు ♦ నాడిపోసినను
నాథునిపైనిల్చి ♦ నగ్నమ్మయిన
నాయనురాగము ♦ మాయదె చెలియ!

* * *



# మే ఘ ము

శా. ఆకాశంబున జీబుకాడె సొగసై ♦ యాషాఢయోషాసితం
బాకీర్ణాలకజాలకంబులన పా ♦ యల్ పాయుత్రై మేఘముల్,
రాకాచంద్రవిలాసముల్ మసుఁగువా ♦ ఱన్ నైల్యమాల్యంబులై
ప్రాకెన్ జీకటిచెట్లుసోయగపుపూ ♦ రంగుల్ దిశాంతమ్ములన్.

సీ. చినుకుచినుకునకుఁ జీ ♦ లిన చిన్ని రేకుల
తోడ పద్మంబు ల ♦ ల్లాడఁ దొడఁగ
ఘారధారకు మాపు ♦ తెగిలిన చిగురుల
తోడ కొమ్మలు సొంపు ♦ లోడఁగడఁగ
జల్లుజల్లునకుఁ దృ ♦ ష్ణఁగు సళ్ళు తీయుచున్న
తోడ చాతకము ల ♦ ల్లాడసాగ
ఉరుమురుమునకు నం ♦ కురమైన మొలకల
తోడ వేణువులు తూ ♦ గాడనయ్యె
గీ. ఖేదమున మోదమవనికి ♦ గీలుకొలిపి
ప్రౌఢవయి నటియింతు వా ♦ షాఢలక్ష్మి!
పల్కు లేక ప్రాణ్ములు నా ♦ నాల్కగూడ
క్రొత్త చక్కిలిగింతల ♦ గుస్తరింప.

ఉ. ఎండిన బీళ్ళయందు నుద ♦ యించిన పచ్చిక కంఠపాడువై
యుండగ చూడి యాలుతల ♦ లూపుచుఁ బోమెడి, క్రొత్తనీటిచే
నిండెఁ దటాకగర్భములు, ♦ నిష్కుటముల్ కడుశ్యామలంబులై
మెండుకొనెన్ వనిన్, మొగిలు మేసెఁ బ్రభాతములందుఁ గొండలన్.

శా. నీడల్ గట్టఁగ భూమియుండు, చదలన్ ♦ ప్రేలాడు కాదంబినీ
చూడాకృష్ణకలాపగుచ్ఛములపైఁ ♦ జూడ్కుల్ కటాక్షించి, లీ
లాడోలాసుఖలాలసీయురతి సో ♦ లన్ సాగె నృత్యోత్సవ
క్రీడోన్మాదములై మయూరములు సా ♦ రెన్ పింఛముల్విప్పుచున్

గీ. కడలిమూలలనుండి పి ♦ క్కటిల లేచి
బొబ్బరిల్లుచు మబ్బులు ♦ పోవసాగె,
గుబ్బెతలఁ జిత్తచపలత ♦ గుబ్బటిల్ల
చల్లని మిథఃకలాపముల్ ♦ చనువుగొనుచు.



# ఎవరు ?

## I



ఆఱుచున్న కలంకారిచీర చెఱఁగు
లనఁగ నాశాముఖంబుల నందగించె
భాద్రపదనీలనీరదపంక్తు లపుడు
వ్రాలుచుండె నభోమణి వాడుకళల.

తామ్రవర్ణప్రవాహంబు దరులుదాటి
వఱదఁబెట్టినయట్లు చూపట్టె సంధ్య
మఱలి చనుచుండెఁ బసువులు మార్గలక్ష్మి
యాటలాడుచు వలచు నొయ్యారినడల.

కృష్ణయొడ్డున నేకాంతకేళిఁగోరి
కూరుచుంటిని యొకచోటఁ, గొండనీడ
లొలయఁగఁ గుమారకోమలమలయపవన
మల్లనల్లనఁ గెరలి యుయ్యాలలూఁగ.

ఎఱుపునిఱుగదయ్యె నేటిసెల, నొకింత
మునిఁగియుండెఁ దెల్లుపూలపడక,
దరులనలుపు మిగుల దర్శనీయమయ్యెఁగ
నచ్చటచటఁ గానవచ్చుచుండె.

కృష్ణవేణియందెలమ్రోత యింపువోలి
లాలిత తరంగ భంగి సాలావసరణి
శ్రవణలాలనమొనరించె, పరసరమున
వేణువు లనుశ్రుతుల మురిపెముఁ గొలుప.

నిండికొన్న సంధ్యారామణీయకంబు,
పొంగిపొరలు స్రవంతీతరంగశోభ,
యొండొరుల ముద్దులాడుచు నుల్లసిల్లె
లనదపూర్వప్రణయులగ్నలాలనమున.

ఇంతలోన రక్తిమ కృశియించిపోయె,
చీకటిజడల్ ముడుల్ విచ్చి చిందులాడెఁ:
గాని విశ్రాంతిఁగనలేదు కర్ణమోహ
లలితమైన వీచీవేణుమిళితగీతి.

పొదలయం దెందొ కనరాక పూర్ణపరిమ
ళమునఁ ద్రోవరులనులాగు సుమములట్లు,
కటిక చీకటిలోపలఁ గానరాక
పాడుచుండిరి గంధర్వభామలెవరొ.

హా! యనుచు ఘోషిలెడి యేటిఁ బాఱఁజూడ
చూపుదగులవు పాలయినుక పడకలు
గాని, తెల్లపూఁబొన్నలుగాని, మునుఁగ
నట్టి గట్టుల నలుపుచిహ్నములుగాని.

చాకిరేవునఁ గాలెడు శవమొకండు
మినుకులాడు దీపముతోడఁ జనుచునున్న
నావ యొకడుమాత్రము దోఁచె నాకుముందు;
హృదయ మేదోకలస్ఫూర్తి ముదితమయ్యె.

అపుడు చప్పుడుగాకుండ నడుగులిడుచు
నెవరొ నడయాడు సరిసన్న లేగుదెంచె

తొణకి యలసాలసములయి తోఁచు నూర్పు
కెమ్మెరలఁబట్టి వలఁగొనెఁ గమ్మదనము.

స్ఫుటముగాఁ గానరాని యాసొగసురూపు
ఎటుచనుచున్న యనుమానమెత్తెనాకు
తదభిముఖుఁడఁగా నూరించె నదియు నన్ను
సంవృతంబైన కవి కావ్యశైలి పోలె.

'ఎవ్వరీ చిమ్మచీకటి నేకతమునఁ
బోవువా' రని యడిగితి ముందు నేను
ఎడతెగని వేణుగానమం దడఁగెఁ గొంత
నాదుకంఠస్వరంబు విన్నాణముగను.

ప్రకృతిసాక్షిగఁ బల్లెత్తి పలుకలేదు
తన యుదంత మావంతేని చనవుపెనఁగ
పరిచయము లేనివారల వరుసలేద
వలపు వాడల ననియైనఁ దెలుపలేదు.

మేలిపూదండయొకటి నా మెడను వైచెఁ
జుట్టుచెంగావిచీర యంచులు బిగించి
పిరుఁదు లసియాడఁగట్టిన వెలది యోర్తు
భ్రాంతిమానసవీచికల్ అంపిలంగ.

మగువహస్తమ్ముతోఁ దనమస్తకమును
నాభుజస్కంధమందు నానఁగఁ దవిల్చి,

చేరెడేసికన్నులనిండ ధారగట్టి
విడిచె నశ్రులు పయ్యెద తడియుచుండ.

పద్మముఖనోటి తాంబూల పరిమళంబు
తరుణమగు పాణి మంచిగందంపుఁబూఁత
ఫాలతలినున్న కస్తూరివాసనలును
నాదుహృదయము మాకర్షింపలేదు మొదల.

సగముతడిసినపైటయు, సగముఁవ్రాలి
యున్న కనురెప్పలను, సగ ముదుకురక్తి
మానసు సగము, సిగ్గు సగముఁ బెనఁగులాడు
నాయమ కావస్థలే సగమాయె నాకు.

వింతపై వింత మంచుగప్పినవితాన
ననుజెనకి యాక్రమించెఁ గృష్ణాతటాన,
అకట! యేటియానంద భిక్షాటనంబొ!
మోహనములైన సంకేతభూములందు.

ముదితపెదవి సిగారింప ముత్యమంత
మాటలాడనికోఁ అంత యారాటపెట్టె
పైటవడువు కన్నీళ్లతోఁ బాటు నాదు
మనసుఁదడిపె ననేకభావనలు నపుడు.

కాంక్షలే నిన్ను విడచెనో కలికి! లేక
నీవె కాంక్షల విడనాడినావొ తెలుపు;

మీనిశీథతారలతోడు! కృష్ణతోడు!
చెడ్డయొట్టున్న దిఁక మీఁద జెప్పవేని;

అనుచు దూరమునను వినవచ్చినగాని
మొఱుఁగుఁబెట్టియూఁకొఁ బలుకరించి
యూరకుంటినంతె, నొకకొంతసేపటి
కబల యిట్టులనియె నమృతవాణి!

II

ఓర్వలేనివారెవ్వరో యొకరినొకరు
పోల్చుకొనకుండఁ గ్రిందకువాల్చినారు
నీకు నాకును నడుమ నీ నీలితెరలు
సెజ్జపయి ప్రణయులమధ్య లజ్జలాగు

ఎవతవనుచు నన్నడిగితి వీవు మును?
ఎవఁడవని నిన్ను నడుగరాదేల యిపుడు?
సందియమ్ముందితోటు నాయందెరవళి?
ఏల నీ బాలకము సంశయింపరాదు?

ఎవతెనని స్పష్టముగ వచియింపఁగలనొ?
అనువుగాఁగన్నవారింటి యాఁడుఁబడుచు
నీడుగాఁ గొన్నవారింటి కోడికోడ
లిని, గ్రహింపు మిఁదెవతెనో! మనసులోన.

ఒకనికిఁ గుమారితను, మఱియొకని కాలి
నింక నొకనికి తల్లిని యిందులోన

నెవ్వరితనో? భావింపుము హృదయమందు
వానివయసలు జ్ఞానసంభవము లేని?

నన్నుగని పాఱవైచి ప్రాణములు విడచె
ననఁటిచందాన మాయమ్మ, యప్పుడాది
పెంచి రెండుచేతులంబెట్టి పిన్ని మొదలు
గాఁగ నా ప్రజనంబులు కాంక్షతోడ.

వెన్నతోడ వండిన ధవళాన్నములను
ఎండ బడి భుజించుటే యెఱుఁగ నెపుడు;
పూఁతెసలుఁగుల తలయంట్లు బోసికొనక
శుక్రవార ముఖమ్ములే చూడలేదు.

ఆకుమఱుఁగు పుష్పముపోల్కి నందముగను
నన్ను బెంచుచునుండి, రైనను మదీయ
తరుణసౌందర్యరేఖలే యిరుగుపొరుగు
ఆడిపోతల కాకరమాయె నోయి!

చదువుఁజెప్పెను నాకొక సాటియింటి
చిన్నవాఁడు నేరుపులు పుష్పించుభాతి,
వలపడియెఁ గొంతచక్కని యన్వయంపు
పాటవమును నలంకారపరిచయమును.

అందమయిన పద్యంబుల నల్లునతఁడు
నునుపుఁబోఁగుల పట్టు నేసిన విధాన

పాడఁగలఁడు తియ్యని యూష్టపదుల నెల్ల
సందెలందుఁ గల కల కషాయఘణితి.

పాడుచుందు నే నాతఁడు పాడినట్లు,
చదువుచుందు నే నాతఁడు చదివినట్లు,
ఇరువురముగూడి యొక్కప్పు డేకకంఠ
సరణిమై నాలపించు ముచ్చటలుగలవు!

తేటలారెడు శుక్ల చంద్రికలమాద్రి
మా వయసుతోడఁ జెలిమియుఁ దీవలెత్తె,
యూరివారల దృష్టులు గోరగింప
నాల్క లపవాదరచనలఁ జిల్కరింప.

కొమ్మకొన నందగించిన క్రొత్తపువ్వు
ఎండవెండటి కెన్నెన్ని చందములను
భిన్నభిన్నాశయములు మొల్పించునవుర!
ఐక్యగతియె ద్వైతాద్వైత మైనరీతి.

కావ్యకలలసింగారించు కవులమనసు
నళిమధువుఁబోలె నాసింతు మనవరతము
నవరససుధాకణాస్వాదనమును మరగి
తనివియే యెఱుంగము స్తనంధయములట్లు.

చదివినకొలంది నాత్మల నుదయమయ్యె
భావములు స్వాతిముత్యాలకోవలటుల

బాల్య సంలగ్నమైన ప్రపంచరక్తి
పాలువిఱిగిన గతియయ్యె బడుచువాఁడ!

## III

పగలు రే లిట్లు దివ మొకయుగముగాఁగఁ
గడచుచుండఁ గొండొక ప్రొద్దుపొడుపు వేళ
బిచ్చమునకయి బైరాగిపిల్లయొకతె
వచ్చెఁ బాడుచు గోముఁగల్ మచ్చరింప.

మాసిన మొఁగాన చెక్కిళ్లమవ్వ మొలయు,
పచ్చతంగేటి పూరేకువంటి మేని
పసిమి మురికిపేలికలలో వాడుచుండె;
ధూళిమునిఁగిన బంగారుతునుకఁబోలె.

ముదిత యింతింతవాల్గనుల్ బెదరిబెదరి
యెంతవరకుఁ గటాక్షించె నంతవరకు
నల్లకలువపూవులతోరణములు నిండె
పెండ్లివాకిండ్ల చందాన వింతభంగి.

అబల యులుగులుదీసిన యనుస్మృతిసరసి
సరణిఁ గలకంఠ మెత్తి మూర్ఛనలునిండె,
నెన్నివిసరులు విసరె నాకన్నెపాట
నన్నివిసరులఁ బారవశ్యములె గురిసె.

పూరిసడిసెముండటు దేవపారిజాత
సాల మతిపరిమళములు జల్లుకరణి,

ఎక్కడఁ ఘటిల్లెనో యెల్లచక్కఁదనము
లా దరిద్రకుమారి మోహనపువాణి.

కడుపునిండఁ గన్నని యున్న కబళములకు
నోచుకొనని యాకన్నె కే నోములిచ్చె,
రాలుగరఁగించు గంధర్వలాలనమ్ము
జన్మవాసనలెంత నైజములో జగతి.

మలినవసనమ్ముఁగట్టిన మలిన తనువు,
మలిన భిక్షాన్నములుదిన్న మలినవాణి,
నెట్టు లాసించె నాకార! యింపుగులుకు
అఖిల కిన్నరీదుర్లభ మయిన గీతి.

తీవ లెగలాగి దిగలాగి తీవరించు
వైణికులకుఁ జిరంతనాభ్యాసపటిమ
స్వరము లనుప్రస్తరించెడు పాటకులకు
అమృతసదృశమ్మయిన గీతి యబ్బదేమొ !

మొగము నవనీతమృదులమై మెఱయుచెలికి
మనసు నవనీత మయియుండ దనుటనిజమొ!
వనలతలకును నుద్యానవనలతలకు
భేద మరసినకవి యెంత వేత్తయగునో!

గాత్రమెత్తి యా బైరాగి కన్నె యట్లు
పాడుచుండెను, వాకిండ్లవాడలెల్ల

చిత్తరువులతోఁ రాణించు చెలువుదోఁచె
ఎచటివా రచ్చటనె చలియింపకుండ.

వీథి వీథులఁ బొరలె నాబిడ విలాస
రాగలాలిత గానతరంగ భరము
చెలి తమలపాకు తీవ పాదులకుఁ బాఱు
ధవళజలకుల్యభాతి నార్ద్రంపుగతుల.

ఆమె పాడిన పాటల నాలకించి
అందుముకుళించియున్న భావార్థమెంచి
ఒకవిధంబైన యున్మాదచకితదశల
కగ్గమైతి మే మిరువుర మద్భుతముఁగ.

IV పాట.

పున్నమజాబిలి! ఓభామా!
పూచినసుఖరాత్రి నోభామా!
నెవ్వగతారలు! ఓభామా!
నిదురఁబోవనివేళ నోభామా!

పవనునిలాలన కోభామా!
పువులువేచెడి సందె నోభామా!
మొగలిపూరేకులు ఓభామా!
మొగములెత్తెడివేళ నోభామా!

నీమీఁద మోహము నో భామా!
నిలిపి యోపఁగలేక ఓ భామా!
వెన్నెలలే తెంచు ఓ భామా!
సన్న త్రోవలుబట్టి యో భామా!

తీయని గీతము లో భామా!
తీసిన తెన్నుల నో భామా!
సొగసు పేర్మి వుదీప మో భామా!
చూపినజాడల నో భామా!

భావోత్తరీయము నో భామా!
పఱచి చేసిన దారి నో భామా!
ఎవరును గనకుండ నో భామా!
యేకాకినై లేచి యో భామా!

కాళ్ళు నొప్పులు పుట్ట నో భామా!
కడు నడివచ్చితి నో భామా!
నీ మేలిపడకిల్లు ఓ భామా!
ప్రేమతో వెదకితి నో భామా!

వేసిన వాకిండ్లు ఓ భామా!
వీడఁగఁ దట్టితి నో భామా!
సుఖశయనంబున నో భామా!
సోలిన సుప్తిని నో భామా!

కాటుకరెప్పలు ఓభామా!
కబళింపనీవుంటి వోభామా!
మీటినకిన్నెర ఓభామా!
పాటనావంగలేను ఓభామా!

ఏబంగరుకల లోభామా!
నీవుంటివోయప్పు డోభామా!
కనురెప్పలైనను ఓభామా!
కదలలేదేయప్పు డోభామా!

బొటనవ్రేలయినను ఓభామా!
చిటుకనలేదప్పు డోభామా!
ఆపరవశదశ లోభామా!
యాదలింపరాదని రోభామా!

అడుగుకదలకుండ నోభామా!
ఆవలవచ్చితి నోభామా!
నీప్రేమయారాట మోభామా!
నీకొప్పగించితి నోభామా!

సందెరంగులబూయు నోభామా!
యందపువాకిండ్ల నోభామా!
స్వరమధుధారలు ఓభామా!
జల్లులాడినచోట నోభామా!

ఆనందసూత్రము లో భామా!
అల్లు తెల్లని పైట నో భామా!
నాయాటపట్టులె యో భామా!
ననుపున్న రమ్మట కో భామా!

V

గీ. అతఁడు వలచిన ప్రేయసి యన్యయనుచు
నేనువలచిన వన్నెలా డితరుఁడనుచు
వేఱువేఱైతి మంటెట, చారుజలద
గర్భమునువదలిన జలకణములట్లు॥

గీ. ప్రేమపుష్పమ్ము పైఁ గాంక్షఁబెట్టి మనసు
లుత్కటమ్మగు విరహాన నుడికి కమలఁ
జీలిపోతిమి త్రోవలఁ జరవిలీన
మధురమైత్రి శరన్మేఘమాలగాఁగ॥

గీ. అందమైనచందములఁ బ్రియమ్ములయిన
యాటపాటల భక్తిలీలానురతుల,
ప్రియుని సుఖశోభనమ్ముఁ గోరితిని నేను
సరససుమములఁ బ్రియుఁబొందు చైత్రిచాయ.

గీ. కర్కశములగు నియతులఁ గష్టమయిన
జపతపంబుల, నిష్ఠాప్రచారగతుల,
ప్రియసమాగమపుణ్య మర్థించె నతఁడు
భీష్మతపన రోహిణిఁబొందు గ్రీష్మునట్లు.

గీ. ప్రొద్దుపొడుపులఁ గమ్మని పూలజతల,
సంజెవేళలఁ జల్లని చందనముల
నిశల మధురవీణాలాలనీయరుచుల
నదిమొదల్ ప్రియుఁ గాంక్షించి వెదకుచుంటి.

గీ. పైరదిరిగి కళ్యాణపు పాటఁబాడు
పచ్చివంశిని బతిమాలి భంగపడితి,
"ముందుముం"దని వినఁబడ్డ మోహనోక్తి
సూత్రములులాగినట్టు లంచులను నడచి.

గీ. సంకెలలు త్రెంచి పోదుఁ బూసంకెలలను
బ్రియుని బంధింపవలెనంచు పిచ్చివాఁడ !
నాకు సహకారివగుచు నీనావ నిచ్చి
కృష్ణ దాటింపు, మవల సుఖింపనగును.

గీ. నావ నడియేట నర్తించె నటివిధాన,
నిష్క్రమించిరి పాత్రల నియతివారు,
అలలచేతఁ బాడించెఁ బాటలను బ్రకృతి
యుపుకు నిమ్మకు నీరెత్తి నట్టులుండి.

# కోయిల

ప్రమదరసాలసోదయూతరంగములన్ దగిలించి, శారద శష్పమునను మూలఁబూపెద వయారె! జగంబులఁ జేతన ప్రపంచము బహిరంతరస్ఖలనసంగతి మాని ప్రశాంతమయ్యె, నేత్రములకుఁగానరావు మధురంబుగఁ బాడెద వెందొ! కోయిలా!

గీ. శాంతిసాగరమగ్నమౌ జగతియందుఁ
డాకిన సరసఘోషయే వినంబ
డెను, నడికితేయిగుజ్జు కారడవికెలన
వినుచు నెలసోన బిలబిలధ్వనులఁబోలి.

గీ. మాదు సుకృతంబువలన నీ మధురసూక్తు
లింత వినఁబడు కాక దవ్వింతయున్న
నిస్తరంగానిలాబ్ధి సంధించి యణఁగి
పోక, పఱతెంచుటెట్లు నీపోక లిటకు.

గీ. చదలనుండి చల్లనగు తుషారకణము
లురులునట్టుల హాయిగా కురియు నీదు
కలకల కషాయమాధురీ విలసన లలి
తపద జీవనంబయిన గీతంబునందు.

చం. పిలపిలమంచుమంచుగురిపించెడి వేగునలేచి చిన్ని గం [మం
టలు మొడలందు ఘల్లని స్ఫుటంబుగ మ్రోయఁగ మేయుగొత్తె
దల నరికాచు గొల్లనియుదారపు టీలలలోఁ బ్రతిధ్వనుల్
మొలవఁగఁజేసి మైమఱపు ముంచెదు నీదుపాటలన్.

గీ. కిన్నెర లొయ్యార మదరఁ బల్కించు మించు
బోణులదె యపస్మార నిద్రాణఁగుచుఁ
బలుకు బడియుంపు, సన్నంపు టెలుఁగుకళుకు
మృదు లతాగతి మెఱుఁగ గానుదురు మూర్ఛ.

చం. ధవలచిరత్నరత్న రచితంబగు సౌధము నగ్రమందుఁ బూ
నవకపు సెజ్జపై వలపునన్ దన వీణియ మేలగించి, మో
హావశముగాఁ బ్రపంచమును నాకుల వెట్టు నొయ్యారివోలె నీ
భువనములెల్ల నాదమయముం బొనరించెద వౌర! కోయిలా!

గీ. పొరలు పకులని బిగువు పూవిరులసరణి
బాలభాషలపగిది నవ్యక్త మాధు
రీధురీణ సారళ్య సంత్రాణభరము
గ్రుమ్మరించెదు నీగీతి కోకిలంబ!

చం. రతనపుముక్కలట్లు రుచిరంబగు పల్కులతోందచందమం
చితముగ నేర్చికూర్చి విరచించెదు నీమృదుగీతి, నింతయున్
యతనపుఁ బాటవంబును బయల్పడనీవు పికంబ, నీదు గు
బ్బైతనయగారపుంగయితె విశ్వము మూర్ఛిలజేయు టబ్రమే!

చం. చినుకులుచిన్కులై మధువుసిందెడునట్టు లలంతియంతలా
తునుకనుడుల్ జితించి, కలదో! మతిలేదో! రసంబో! భావమో
యని మెదిమెద్దియాంచుఁ గవులత్తులుఁ సాచఁగ మబ్బునీడ డా
గిన నెలరేకసోకు లాలికించెదు నీకవనానఁ గోయిలా!

గీ. మఱచిపోయిన యేకవిమణి సజీవ
గీతికలు మాకు విన్పెద వో తలంప
శాంతియెఱుఁగని యీ మనుసంతతులకుఁ
దెలియఁ బడదింతయుఁ దదర్థముల తెరంగు.

గీ. తగులపుందీపియును, బిడ్డమొగము నెడలఁ
దెగనికాంక్షయు, స్వార్థవృత్తినిరతియుఁ ద్య
జించి, తన దేశమాత సేవించు వీరు
నెవని మఱచితివో వచింతువు పికంబ!

గీ. నిండుకవుఁగిల్ల కెడఁబడి మండు విరహ
మునఁ దపించెడి యే ప్రవాసినులఁ గాంచి
మెత్తనగు గుండె జాలిరేకెత్తవచ్చి
తెలుతువో నాయికాదేశములను పికమ!

చం. అకట! నిషాద! చేతు లెటులాడుఁగదోయి! సుభేద మోహకా
తుకమున మైజడుల్ మఱచి తూలుకపోతము నేయగా! వధిం
పకు వధియింపకంచు పికమా! యనుకంప తొలంక సాశ్రుగీ
తికలను వేసుకొందో! కలదే? తెలియంగ భవద్విచారముల్.

ఉ. ముత్తెపుటశ్రువుల్ నయనముల్ డిగజాఱఁగ మాటరాని డ
గ్గుత్తికతోడఁ జంపకపు గూతుఁ గవుంగిటఁ బాయలేని యే
మెత్తనితల్లికన్న చెలిమిన్ మధురంబుగఁ గిరితింతువో
క్రొత్తయిగుళ్ల మేసరి! యెఱుంగముగా! భవదీయబోధలన్.

గీ. ప్రణయ గాథయొ? దారుణ రణకథా క
థనమొ? లేక సందేశ గాయనకళా క
లాపమో! తేటఁబడదు నీ లలితగీతి
చంచలతనూఁగు మర్త్యప్రపంచమునకు.

గీ. పలు తెఱంగు, లనేక భావములు, భిన్న
రుచులు, కలయునికళలు రేగుచుఁ జలించు
విశ్వమిదె విశ్రమించి నీ విమలబోధ
వినియెడిని తదర్థ మెఱింగికొనెడునాస్థ.

గీ. పవలు రేలును నాకమవ్వంపు జెలుల
కౌఁగిళులఁ జొక్కి సోలెడు కాముకులకు
బోధపడదింతయును నీదు మోహనోక్తి
సొలపులనుమాన్ప కలజడిఁ గొలుపుగాని.

గీ. తర్కముల బోధగాక, సూత్రముల విడక
భాష్యమీమాంసములఁ దేటపడని, తాత్త్వి
కులరహస్యములెటు తీర్పఁగలవా పికమ!
ఆలకింపనున్నారు వేదాంతు లదిగో!

గీ. "కో"యనెడు నీదు మేల్కొల్పు హాయి కలరి
వెలుఁగులిచ్చు ఫుల్లుల కలకలమువినెదొ!
స్వకుల సందేశమును నాదుపలిపి, యాస్వా
యించునీగీతి నెటు సమర్థించుకొందు?

గీ. సెలవి నురువులతోడఁ బచ్చికలురాల
నిలువఁబడు మోములనుసాచి నెమరు మఱచి
పాడియావులు నీముద్దు పాటవినుచు
నెదియొ పరమార్థమందుల నొదవుననుచు.

చం. పసితనమందు నుయ్యేలలపై నునుబొత్తుల పండఁ బెట్టి పో
రుసడల మాదుతల్లు లలరుంగతి నేమృదుగీత పాడిరో
యసలది విస్మృతంబుగ నెనప్పుడె మాయెడ; నిల్చియుండె నీ
దుసుకృతి లేకయున్నఁ గలదో? కలమాధురి యింతనీరుతిన్.

ఉ. పెండ్లికుమారుఁడై చిగురువిందులకేగు వసంతు రాక నిం
డ్లిండ్లకుఁబోయి తెల్పెదు పయింబయి కొమ్మలనంటికన్నెపూఁ
బోండ్లకు రాయబారములొ మోహబుతూదయొ ప్రాతగీతమో?
పండ్లును జెండ్లునుం బసపువారెడు పూవుల నోము పాటలో.

గీ. పూలపూజలు సలిపిన మోహనుఁడు వ
సంతుఁ డాతని రాక నీవింత చాట
నేల, కేవల నాంది కాఁజాలదిదియు
చాల పరమార్థమెదొ తెల్పఁబోలు పికము!

చం. మెలమెలఁ బాఱుకాలువ సమీపమునన్ గడుమెత్తనైన శా
ద్వలముపఱుపున్ వేయించి, మమతంబొలివోని ప్రియాను
[రాగ ని
ర్మలమదిరాంధసాల సభరంబునఁ దూగు కురంగదంపతుల్
నెలమిమివినంగఁ బాడుము ఫలించును నీశ్రమమెల్ల! కోకిలా!

కం. పలికించినదారువుల రు
తులకుఁ జెవులు కోసికొను నధోగతులకు సి
గ్గొలయఁగఁ గలకంఠము! నీ
కలకంఠ రవామృత మొలుకం బాడెదవో!

గీ. పిదుకువెన్నెలపాలు జేమొదవు కమ్మ
కప్పురంబిచ్చునట్టి చిక్కని మరంద
మొలుకుఁ బూగుత్తి కడుపునఁ దెలియరాదు
నైజభిన్నత సృష్టి సంతానమందు.

గీ. పవనమును దిఃస్యాగించి మార్దవముఁ బెంచి
నవనవంబగు రసము మొలవరచించి
చిత్రికులకును గవుల కుజ్జీవమును ల
గించు కోకిలా! నీపూత గీతఫలము.

చం. మినమినలాడు క్రొన్నురుగు మీఁగడతెప్పలు తేలుచుండఁ
గొండ నెనసి పాఱు కాలువ కెడాపెడ మొల్చిన చెట్లగుంపులో
వినఁబడు "గింగురుల్" సెవులపీడ యొనర్పక మున్న నీమృదు
స్వనమును వెల్లిగొల్పి కవిసంతతులన్ గరుణింపు కోయిలా!

గీ. చెలిమి మానుడు లాలకించినను సరియె
విప్పి నీభావములను జెప్పినను సరియె
కాక యుండిన ఫలమేమి కోకిలంబ!
త్వదుపదిష్ట గీతామాస్వాదయమువలన.

ఉ. ఇంపగునీదువాణి నుదయించెడి యొక్కొకమాట యొక్క ప్రా
ణంపుసుధాకణంబయి మనంబుల నువ్విళులూరఁ జేయు మో
హంపుభరంబుఁదీర్పఁగ ప్రియంపు తలంపెడఁగింప, కింకశాం
తింపులజోలలేల వినుతింపుల లీలలవేల! కోయిలా!

చం. వినఁబడలేదు కృష్ణు వలపింపుల పిల్లనగ్రోవిపాట లిం
కను, జనియింపలేదు కలికాలమునం దల రాధలెందుఁ, జ
ల్లని యమునానదీజలములన్ మెడలెత్తుక నీదులాడ వా
వులు నిఁక నేటిగానములుపో! తలపెట్టఁగమాకుఁ గోకిలా!

గీ. నవరసంబులు పోషించినారు కవులు
నవరసంబులు నీపోషణమున నడరు
తన్మయానందమధురి మోదయభరంబు
గడుగు నీగీతి నేమి పల్కుదును పికమ!

గీ. దివ్యసందేశమనుచు సందియముకొంత
కలకలాగీతియను కలకలము కొంత
నైజకంఠస్వరంబను మోజుకొంత
కలిపి కలఁచెదుమమ్ము పాటల పికంబ!

గీ. విసువక యనేకవత్సరాల్ కొనరి కొసరి
ఋతువు దప్పక చాటెనయేని నీదు
పాట కర్థంబునుంతయుఁ దేటపడదు
ఆటులగుటఁ దావకాదేశ పటుతరోక్తి
యఫమ మానవతతికిఁ గాదని తలంతు.

# కనకము

(ఒక స్వప్నము)



ఎండం బురదంబడి యె
క్కుండనె కాళ్ళీడ్చుకొనుచుఁ గడు నలసటతోఁ
రెండామడ  నడచితి తప
నుం డస్తాచలముఁ జేరను దరిసితిఁ బురిన్.

గీ. పెరుగుఁ నన్నంబు సాపడి ప్రియములాడి
తూగులాడెడి నిద్దుర నాఁగలేక
పవ్వళించితినొక్క తల్పంబునందు
ఎచటికో పోయెఁ బ్రాణంబు లింతలోనె.

గీ. కోడి కూయుచునుండెఁ 'గొక్కొ' యనుచు
అప్పుడు మెలకువగదిరె 'ముద్దాడుచున్న
సొగసుపిట్ట' చివాలున నెగసిపోయి
నటుల నెద్దియొ విస్మృతి యానుకలన.

ఉ. నేను శయించియున్న రమణీయనిశాంతమునందు, మెత్తనౌ
పానుపులందు నిద్దురలఁ బాయకయుండి రనుంగుచెల్లెల్
జ్ఞానవతీశిరోమణి, ప్రసన్నగుణాదర నాదుపిన్నియున్
మేనుతెలుంగకుండ నలమెన్ బెనుమైకము వారి నయ్యెడన్.

చ. పడమటిదిక్కునన్ ముసుఁగువాల్చక యుంచినజాలకంబునన్
నుడివడ స్రుక్కి యొక్క పడుచుంబులుఁగయ్యెడ దూఁటివచ్చి, డా

కడ తెల్లి మద్దుగుజ్జువయిఁ గాళుల నానిచిసిల్చి, జంకెసల్
కడకనులం దొలంక, నయనాగారమువస్థల యుంటుదోపఁగన్.

గీ. వలపు చిగిరించె నాముద్దు పులుఁగుకనులఁ
బడినయంతనె, 'యెటులేని పట్టుకొనెను
నాస యంకురమయ్యె నాయంతరమున'
కలదు నాకిట్టి నైజచాపలము కొంత.

గీ. నిదుర లేపితిఁ బిన్నిని, వదలెసుప్తి
చెల్లియును, వన్నెలొలికించు చిన్నిపులుఁగుఁ
గైకొనలఁ జూపితిని వారు కనులువిప్పి
నలచికొనుచును నలునిటుఁ గలయఁజూడ.

ఉ. ఆరతినాలపిట్టను సుపాయముగాఁ గడియించు కోలు
మీరలు తోడుకొండనుచు మెల్లన వారికిఁజెప్పి, జాలకో
ద్వారపటంబులన్ దిగిచి, దగ్గరియున్, బెదపోయియున్, గడల
దూటితియు, వంచిపొంచి, యెటులో! కయిసాదిపులుంగుఁబట్టితిన్.

గీ. మిసమిసల పుట్ట, మవ్వంపుఁ బసలగుట్ట
సొగసు రతనాలతట్ట, సోయగపుకట్ట
ప్రియములకు పెట్ట, యా మురిపెంపుపిట్ట
చెలువములపట్ట మేమని పలుకవచ్చు.

గీ. పసుపుచాయను కలదు ఱెక్కకొనలయందు
కదలు పున్నాగ పత్రరేఖలనుబోలి,

పద్మదళఖండ మనసాఁగ పాఱియౌత
నలుపుమచ్చయొకండు సొంపొలయుచుండె.

ఉ. మెత్తని పట్టుకుచ్చు కలిమింగయికొక్కయె పూలగుత్తి నా
యుత్తరుణంపుఁ బుల్గు కడుపచ్చపు పొందికతో నెసంగు కెం
పెత్తిన దొండపండనగ నింపగు దిద్దిన కోలముక్కు, ఆ
ముత్తెముపంటి పిట్ట పొలుపుం జెలువుం దరమే వచింపఁగన్.

కం. కొనగోరులు నునుపయి వం
గిన మావిచిగుళ్ల పగిదిఁ గెంపెసఁగియు వాఁ
డిని నతినిశితములై పొలి
చినగతిఁ గనుపట్టెఁ గొలఁదిచీలిక లగుచున్.

గీ. నడల కుల్కు బెడంగు, అందంపు మెడను
పెడకుఁ ద్రిప్పుచు టెక్కులార్చెడి సొబంగు
కళుకుఁ దులకించు నొడలి యొప్పుల తెఱంగు
కలదు కాదెందు లేని ఆకనకమందె.

చ. అలతలువాయఁగా, జడుపులాఱఁ, బ్రియంబున దువ్వుచున్ గరం
బుల ననుకూల పంజరము పోలికఁ జేసి, వినోదభార వి
హ్వలమతి నయ్యనెయ్య మొలయంగను బ్రాణములొక్క యొత్తుగా
వలపునఁ జూచుచుంటె బలవంతము మానివిహంగరత్నమున్.

గీ. పెనఁగులాడుచుఁ గొంత, మ్రాగనులు వెట్టి
కదలకయ నిల్చి కొంత, చక్కని నఖాగ్ర

ముల నెఱకలు గోకుచుఁ గొంత, కలఁగి జివ్వన
నెగసియెగసియాసు గొంతనటనఁజూపె.

చ॥ ఇటులొకకొంతయాటలపయిన్ మమతంగనకంబుతోఁబెనం
గుటఁగనులారఁగాఁ గని యిగుళ్ళయెడం దనుజాలి మోన తె
త్తుట వచియించె పిన్ని! కలదో? సుకుమారమణీ! వినోదలం
పటమతివైపులుంగునకు బొమ్మలువన్నియు,వింతసూచుటల్.

కం॥ ఒడలెల్లఁ జెమటలెత్తఁగఁ
గడు శ్రమముంబడితి వేమి కనకము గలదీ
కడగండ్లమారిపులుగున
కుడిచినఁ గూర్చుండఁ బోవు కొంచెము కుత్తా!

కం॥ వదలఁదగు నీపులుంగును
సదయుఁడవై యాట పాట పయ్యాటలకీ
మృదులద్విజమోపదు, పం
పెదుగాకల యుత్తవారి పిల్లనుబోలెన్.

కం॥ అని యాడువారి మెత్తని
గొనముల నారళ్య మలమికొనఁ బలికిన నా
పినతల్లి మాటలను జెవు
లను బెట్టక యిట్టులంటి లాలితఫణితిన్.

శా॥ పిన్నీ! పుల్గును బట్టరాదనుచు నేవేదాంతమోచెప్పి న
న్నున్నొప్పించితి వింతదాక,యెటులూనుక్ డెందమానందశాం

తిన్నిత్యంబుగ? నిశ్చల ప్రియుదముల్ నిండారు విజ్ఞాన సం
పన్నుంజేసెదుగా కృతార్థుడంచు నుబుధుల్ వల్లాఁగ నాలింపవో.

ఉ. డెందము కందళించిన సుడిబండ సనీక విశారదైజమా
త్మం దోలఁగించి, భావసుకుమారత కందికయుండ, నిర్భరా
నంద మరందమొల్కు.. సుమనస్సరసీజములం బ్రమోదతృ
ష్ణం దనియించుచుందు రను జ్ఞానులవృత్తము లాలకింపవో.

శా. తల్లీ! ప్రాణికి నైజతృష్ణలగు సాంద్రంబైన యానందవాం
ఛల్లీలాధృతిఁ గాని చల్లఁబడ, వుత్సాహ ప్రవాహంబునన్
గల్లోలంబగు నింద్రియంబులు తదేకధ్యాన విన్యస్త భా
వోల్లాసంబును గూర్చు, శాంతిననవో యుంబిమ్మటం బెల్లుగన్.

మ. అవనీమోహనమైనయీపులుఁగు మైయందంబు నానందమున్
మివులన్ జూచియుఁ గేలనూచియు శ్రవోలీలోత్సవంబైనమం
జువచో ధోరణి నాలకించియు, హసించున్ నామ సోవల్లి, ప
ల్లవమై, కోరకమై, ప్రసూనమయిలీలాగుచ్ఛమై స్వేచ్ఛగన్.

మ. నునుపుల్ దేఱు మెఱుంగు రెక్కలను నిండుంగౌగిటం బట్టియు
త్తినయుత్సాహము, సోయగంపు మెడవాల్ త్రిప్పుల్లుగాంక్షిం
[చిచూ
చినయుల్లాసము ప్రాయపుం హొయలమైసింగారమీక్షింపఁ బం
బిన సంతోసము చెప్పఁగా నలవియే! పిన్నీ! విచారింపఁగన్

కం. గరుసపు నడలబెడంగును
మురిపెపు బంగారు పక్షముల యందంబుఁ
సురుచిర తారుణ్యాంకిత
తరళంబగు పులుఁగు సొగసుఁదనమును కంటే!

కం. అఱమోడ్పువెట్టి తెలికను
లరుణిమ దలమెక్క జెక్కుటంచుల స్వేదాం
కురములు దొరయు నొయ్యారపు
సరణి ననుభవింప వలపు సాలదు పిన్నీ!

ఉ. కాటుక రేక పొందికలఁ గానఁగవచ్చెడు గుత్తపుమ్మొదల్
బాటెలుతీసె మచ్చలను, బాగుగఁదీరిచి దిద్దినట్టి లా
లాటిక చంద్రఖండము విలాసము, నాసలుదీఱఁజూచి యీ
నీటుపులుంగుఁ బోవిడువనేరదు నా మనమార మిన్నకో!

సీ. పలుక లేదింక 'రవ్వలురువ్వ' గలమెత్తి
జిలిబిలి పలుకు ముద్దులు నటింప
చిలుక లేదింక, తెప్పలలోనఁ జిగురెత్తు
నగవు వెన్నెలవన్నె సొగసులెసఁగ
మెలఁగ లేదింకఁ గోమలపదంబులు గుల్క
నడక పొందికలయందములు వెలుఁగ
చెలఁగ లేదింక నాటలయులంతలువాసి
చనవు మాలిమి తీపిఁ ననువుపడఁగ

గీ. తనియ లేదింక ముద్దాడికొను ప్రియంబు
తీఱ లేదింకఁ బట్టినకోరికయును
వదలు వదలు మటంచుఁ బల్కెదవు పిన్ని
ఎటుల నెడఁబాయఁ జాలుదు నింతలోనె.

క. అనియిటు లెదురాడెడు నను
విని, యనునయ మొలుకఁ బలికెఁ బిన్నియు మఱలన్
కనికారపు టివచినుకులు
కనుఁగొలకుల నిండితొలఁక గద్గదికోక్తిన్.

శా. నా ప్రాణమ్ములు తల్లడిల్లెడిని వెంటం బాఱులంబయ్యెఁ గ్రీ
డాప్రీతుండవుగాక యీపులుఁగుబిడ్డన్ వేఁపెందాక, తం
డ్రీ! ప్రేమామృత మొల్కు చూపులను దీనింజూచి పోనిమ్ము, బా
లప్రాణమ్ముల బాయమిన్ గనులు తేలన్ వైచి సోలింతలన్.

క. తలవాంచి యులంతెలు సూ
పులఁగనఁబడె ఖిన్నభావమునఁ గదలదు నీ
పులుఁగుంజిన్నది, వలపిం
పులఁ దగిలిన నీదు మనసు పొందదు తనివిన్.

క. పసికూనల విసివించిన
ఉసురు మహాఘోరమగుఁగదోయి కుమారా!
వ్యసనంబులఁ దగిలితివి
మిసలపులుం గేలవచ్చె మిడిమేలముగన్?

శా. నేత్రాంతంబులు శోషవోయినగతిన్ స్విన్నంబులయ్యెన్, దయా
పాత్రంబీ తొలికాన్పు పిట్ట విడిపింపంబోలు నీపాటికో
పుత్రా! భూతదయాసుధామధురమై పుష్పించు నీచేత మే
మాత్రంబుం జలియింపకే తగిలె హింసారక్తి నింకేమనన్.

మ. ఎపుడో విస్మృతులన్ స్మృతిందగులునో యీ! నాయనా! చిన్ని ప్రా
యపు రాచిల్కలఁ బట్టరాదనెడి న్యాయంబున్, విచారింపకీ
యపరాధంబునకేల పాలుబడెదీ యజ్ఞాది వేధోండ మా
యపర బ్రహ్మకళామయంబెగద ఛాయాభిన్నమై తోఁచినన్.

మ. కడుపుం దీపినొ హా! కుమార! యని కేకల్ వెట్టవ్యాసుండు నె
క్కుడు వైరాగ్యమునూని, సర్వసములై 'కోహా' మ్మటంచున్ బరుం
గిడు నా శ్రీశుకుఁ జూచి చెట్టులను రక్తింబిల్చుచున్ దన్మయం
బడరన్ ధన్యములయ్యెనంచు మును నీవాలింపవో పుత్త్రుఁడా!

చం. గానములలోన భూతదయ కోమలమంచును నొక్కి పల్కి, చే
తనము సమస్తవస్తుగుణతత్త్వమునందును భిన్నకాంతులన్
బెనుపడియుండునంచు మురిపెంబుల గీతములన్ రచించి, మో
హనముగ బాడుచుందువది యంతయు నెందరిగెన్ గుమారుఁడా?

చం. అల నలచక్రవర్తి కలహంసము నాఁచిన యప్పుడామె శీ
తల వచనంబులన్ జదువ తల్లిరో! ఆలయినన్ గరంగు నం
చెలమి పఠించుచుందువది యెట్టుల మారెను పుత్రి! యాటపా
టల మమకారమున్ విడ వెడందను బుద్ధియదెంత గల్గినన్.

మ. కొడుకా! చెప్పినమాటలన్ వినవు నీకుం దోఁచదేమందు, నీ
పడుచుంబుల్గును బట్టినంతటనె యేభాగ్యంబు నీకబ్బె నె
క్కుడు ముద్దాడి వినోదమారసితి సంకోచింపకే పీడుమా!
యుడియానంబడఁజూడఁగూడదట యేప్రాణంబు నేనిన్ భువిన్.

శా. వెన్నంబోలుగదోయి నీమనసు తీవ్రేవంచి పుల్గోయ లే
వెన్నండైనను బౌద్ధధర్మముల నేమేమో ప్రబోధింతు వీ
వన్నెఁజిన్ని పులుఁగుఁబట్టికొని యిబ్బాముల్ వడంజేయఁగా
జన్నే? గాదిలిపుత్ర! చెడ్డపనులం జాలింపలేవే యిఁకన్.

గీ. పాలుగారెడు నీపిట్ట ప్రాయమైన
అలసి సొలసి యావస్థల లలిత లలిత
మగుచు గన్పట్టు వగచిన్నెలైనగాని
తరుణ కరుణాస్వభావ పాత్రములుగావా!

చం. కలనయినన్ వికారమును గానక, ప్రాణములెల్ల నీపయిన్
నిలిపి, తదేకనిశ్చలత నిండుమనంబున నిన్నుఁజూచుచున్
మెలఁగెడు పిన్నిమాట చెవినింపగదోయి కుమార! ఇంక నీ
పులుఁగును వీడి నామదికి మోదము శాంతముగొల్పుమియ్యెడన్.

కం. అని పరవశయై కరుణము
తోణకన్ వచియించెనామె, తోడ్తోడన నా
మన మెదియొ వికారపడన్
గనకంబును నెగిరిపోయెఁ గలలో నంతన్.

## స్వప్నశాంతి

మ. కలలో ముద్దులుసూపి యాఁకనక మేగన్ దానినెయ్యంపు తీ
పుల కారాటమునంది కుందుహృదయంబున్ శాంతిసేయుందలం
పుల నస్మత్కవితాశుకిన్ బనిచితిన్ భూలోక మీక్షించి యెం
దులనేనిన్ గనకంబుబిల్చికొనుచున్ దోతెంచునన్ భ్రాంతితోన్.



# ధ్యానిబుద్ధప్రతిమ

మ. బహుళాధ్యాత్మిక దివ్యసత్యసుషమావ్యాకీర్ణ తత్ దృక్పయో
రుహపాళీద్వితయంబుయోగనియమారూఢస్థితిన్ మూసి;దు
స్సహబాహ్యస్ఖలిత ప్రపంచదురవస్థా దూరసంసిద్ధికై
యహహా! చూచెదెయాత్మబోధన నిరీక్షాపేక్ష శిక్షావిధిన్.

మ. బయలన్ గాంచినఁగాననమ్మెదుజరాభారవ్యథాదుస్సహా
ర్తియుతక్షోభలటంచు నెంచి పటువక్రీభూత దుష్కాలసం
చయ సంచార వికార మారసి,యపస్మారక్రియాయార్తి రో
సియె,నేత్రంబులుమూసితే!హృదయవంశీగాన మాలింపగన్.

మ. సమసెన్ ప్రాచ్యమహత్త్వతత్త్వము,కళాచాతుర్యముల్ మాసె,వా
సె మహాధర్మయుత ప్రశస్తమతముల్, జీర్ణించెసౌందర్యభా
వము, క్షీణించె స్వధర్మగౌరవము, తీవ్రంబై పరాచారదా
స్యము రాణించెను భారతీయుల యవస్థన్ జూడలేనంచు నే
త్రములన్ మోడ్చిహృదంతరంగమునస్వారాజ్యంబునీక్షించెదే!

మ. నటనంబాడెదు నెమ్మొగంబున చిదానంద ప్రభాలక్ష్మీసం
ఘటితధ్యానవిలాసమూర్తి హృదయాకాశంబునన్ వెల్గు ప్ర
స్ఫుటవిజ్ఞాన కళాంకురస్తబకితజ్యోతిః ప్రకాశంబు ము
చ్చటగా జూపెదు సాధుమాగ్ధ్యగుణగుచ్ఛవ్రాతమా!గౌతమా.

ఉ. ఆసలఁబోనడంచి విషయాదిశరీరసుఖంబులక్ నిరా
యాసమునన్ ద్యజించి పరమార్థమెఱుంగమనంబలంచి, వి
శ్వాసమునించి సర్వసమభావము నెంచి, విశుద్ధతన్మయా
భ్యాసముఁబెంచి,దివ్యపరమావధిఁజూపెడునీదుమూర్తియున్.





# కవిత

తేట లయిన పుణ్యారణ్య ♦ వాటికలను
బుట్టితి సుమఃకుమారి తోఁ ♦ బుట్టుగాఁగ

* * * *

అంద మెగఁబోయు లావణ్య ♦ మాహరించి
తపసినఁ బసియాడు జీ ♦ వనపుఁ త్రావి
పెరిగితిని నిత్యకోమల ♦ స్ఫురణలడర
ఇగురుటాకు నెలల వచ్చి ♦ యెండలందు

* * * *

గ్రీష్మమాసవేళలఁ దే ♦ టినజలాల
స్నానమాడి శిరోజ గు ♦ చ్ఛములు కడిగి

* * * *

నింగి బాలెంతనడికట్టు ♦ కొంగులనఁగ
జాలు నతసీపయోద ప్ర ♦ సన్న రేఖ
లందికొని లాగి చీరెగా ♦ నందగించి

* * * *

క్షాళితవిశాల విశ్వరం ♦ గంబునందు
నిండువెన్నెల తెలిచాంది ♦ నీలుగట్టి
మొలక పచ్చని ముగ్గులు ♦ పుడమిఁదీర్చి
శారదోత్సవ భోగమ్ము ♦ నలిపి దనిసి

పచ్చిముత్యాల వాయనాల్ ♦ పంచిపెట్టు
ఉదయసతి కాకుఁబచ్చప ♦ య్యెదలుసాచి

* * * *

పత్త్రి వస్త్రాపహారణపా ♦ పంబుకతనఁ
జిన్నవోయిన కొమ్మల ♦ సిగలమీఁద
ఋతుహితస్నాన శోభన ♦ మెదుగ నరసి

* * * *

తడిసితడియని నాజూకు ♦ త్రాళ్ళవలల
భావశుకములు బందాలు ♦ పడ రచించి
ప్రాణిలోకమ్ము నానంద ♦ పథవిలీన
మహా దనంతసౌందర్య సా ♦ మ్రాజ్యమునకుఁ
బెనువలపుఁగొన నారాట ♦ పెట్టుచుంటి,
చిక్కిన శకుంతములకు స ♦ చిత్రమయిన
అమలవాగర్థకేళీర ♦ హస్యమధువు
నామెతలుపెట్టి సాకితి ♦ ప్రేమవిరియ

* * * *

నాదుసౌందర్య విభవము, ♦ నాదురేఖ,
నాదుకన్నె సింగారంబు, ♦ నాదుచేష్ట,
నాదునడకల పోడిమి, ♦ నాదుగీతి,
సుమధురంబైన పూజాప్ర ♦ సూనమట్లు
అస్ఖలితమైన కన్నె సో ♦ యగముచాయ
కనులఁబూజించి మనసుతో ♦ గారవించి

వాణిఁద్రావుచునుండి ర ♦ రీణభక్తి
పరిపరివిధాల శోభా త ♦ పస్విజనులు

* * * *

బాలపుష్పము నంటిన ♦ పాపమనుచు,
ముగుదవలె రేకుఁ జెఱఁగుల ♦ మూసికొనిన
మధురతారుణ్య మర్చనా ♦ మాత్రమనుచు,
అడుగుసోకినకడనెల్ల ♦ నణువులణువు
లగుచు ప్రాణకళలు రాలు ♦ నందమెంచి
కొలుచుచుండిరి భావవి ♦ హ్వలులునన్ను

* * * *

నిత్యకౌమార తరుణాభి ♦ జాత్యనగుచు
నింతస్పర్శాకలంకము ♦ నేనియెఱుఁగ.

# ఆచారక్షయము

౧

శ్రీరు తీరుల నలం ♦ కారముల్ ముగ్గులఁ
జిత్రించు మవ్వంపుఁ ♦ జేతిమేల్మి
పూసలతో బొమ్మ ♦ పోసిన యట్లు చ
క్కని కుట్టుపను లల్లు ♦ కౌశలంబు
కైవారములు లేక ♦ యే వలయము లష్ట
దళరేఖల నమర్చు ♦ కలికితనము
పాడేటి రాటాల ♦ పాలు దీసినరీతి
సన్నదారముఁ దీయు ♦ జాణతనము

గీ. తెనుఁగునాఁటి కులస్త్రీల ♦ దినదినంబు
సన్నసన్నగ నణఁగారి ♦ చచ్చుచున్న
వకట! ఈగృహాజీవ దీ ♦ పికలు నిలువ
స్నేహనిధికి భిక్షాటన ♦ సేయరేమొ!

౨

సీ. ఏడాది పొడుగున ♦ నింతతీరిక లేక
చేలలోఁ గష్టించు ♦ సేద్యకాండ్ర
పెద్దపురాణాల ♦ విన నోచుకొనక యూ
రికి దూరులగు దుర ♦ దృష్టజనుల

ఉప్పు కల్లుకుఁ గూడ ♦ నోడ లమ్మవలసిన
ఆధార శూన్యలౌ ♦ అనదవాండ్ర
ఇంటిబానిసచాకి ♦ రే సర్వమని తూర్పు
పడమర లెఱుఁగని ♦ పల్లెసతుల
గీ. ఎవ్వడిఁక తాఁబూర వా ♦ యించుకొనుచు
దరిసి నడపు పజాహ్లాద ♦ తంత్ర మెపుడు?
అన్నకాటక మటులుండ ♦ నావహించె
భూమి నానంద దుర్భిక్ష ♦ మును సఖుండ!

3

సీ. వినువారి కన్నీరు ♦ వినవాకగా బొంగ
సీతమ్మ కష్టాలు ♦ సెప్పిసెప్పి
వెఱ్ఱిగొల్లడు గూడ ♦ నుఱ్ఱూతలూగంగ
వీధిభాగవతాలు ♦ వేసివేసి
ముసలివాండ్రును మీస ♦ ములు త్రిప్పి కాకెక్క
వీరబొబ్బిలికథల్ ♦ వినిచి వినిచి
ఆబాలగోపాల ♦ మావేశమున త్రుళ్ళ
పల్నాటియుద్ధాలు ♦ పాడిపాడి
గీ. పల్లెపల్లెల ప్రాణము ♦ పచ్చగిల్ల
జాతిసుఖము పోషించితి ♦ సర్వకాల
మెచ్చట సురిఁగిపోతివో ♦ బిచ్చకాఁడ
కవివి పాటకుఁడవు నీవె ♦ గావె సఖుఁడ!

౪

సీ॥ బువ్వమ్ముబంతులఁ ♦ గవ్వించి వయసుకా
వరముబ్బ పడుచులు ♦ పాడశేరు
గొబ్బితట్టెడువేళఁ ♦ గూడ కన్నెనెలంత
లరమరలే కాడ ♦ మఱచినారు
తద్దెపండుగల సై ♦ తముయాల లూగుట
మోటుగా మగువలు ♦ మూసినారు
రుక్మిణిమొదలుగా ♦ రుచిగొన్న బొమ్మల
పెండ్లిండ్లు బాలలు ♦ విడచినారు
గీ. ఏ నిరపరాధమగు క్రీడ ♦ లింతవఱకు
జాతిముఖకళలనదగు ♦ బాసలందుఁ
బెంచె సౌందర్యసుఖరుచి ♦ సంచయమ్ము
నా శుభము లస్తమించెడు ♦ నరయరేమొ?

ఓం

# ఒక మాట

౧

పుస్తకము హస్తభూషణంబుగ ధరించి
నడతు వీవీథి నెవఁడవో పడుచువాఁడ!
మృదులముఖియు, సర్వోన్ముక్తహృదయయైన
ఈ పరవశగాయనిఁబిల్తు రేమి పేర?

౨

పంకబద్ధములయి దిగఁబడెడు త్రోవ
లందుఁ గా ల్పెకలింపలే కలసి సొలసి
పోవు పాడియావులు తలంపునకుఁ దెచ్చు
భావగర్భనిర్భరములౌ పద్యగతుల.

౩

వృక్షమున నిగ్గుచేప లూహించి గొప్ప
గండ్రగొడ్డండ్ర నఱకేటి కాష్ఠపతులు
స్మృతికిఁదెత్తు రయోమయశ్లేష కుటిల
కవచములు చీల్చు గూఢవ్యాఖ్యానములను.

౪

హరితశాటీకషణ మనోహరనితంబ
యయి ధరణి మేఘదాత్యము నాదరించు

అమృతరసవశులై యొప్పె సఖుల వికసి
ఆర్ద్రసుమములు బాలెంతరాండ్రపోల్కి.

౫

పచ్చగిలిన వసుంధరాభాగ్యసీమ
నెల్లయెడలఁ గన్విందుగా నుల్లసిలుచు
పసుపుబూసిన ముత్తైదువల మొగాల
ననుకరించి గుమ్మడిపూవు లందమయ్యె.

౬

కలికితీగెలఁ బ్రణయముఖ జిలుకరించి
శ్రావణవనస్పతులు పచ్చిరసికులైరి
తెక్కలెత్తని బాలశారికలుగూడ
నీడముఖముల గుసగుస లాడదొడగె.

౭

కం. పలికించిన పలుకఁ డికేఁడు
నలినేక్షణ! తెనుఁగుమీఁటినాఁడేమొ సుశీ
తలసుభగంబుగ నాతోఁ
బలుకుము నీవైన చెలువపాలొలుకంగన్.

౮

గీ. మేళవించిన తీఁగెలమీఁద మీటి
యీ జగన్ముగ్ధపదము వాయింతొ? లేక

సఖుఁడు బెజ్జాలు వేసి సాజంపు విరతు
లూదుగదీర్చిన వేణు వ్రూదెదవొ? చెలియ!

౯

గీ. శ్రుతికిఁ జెవులొప్పగించి రుచు లుదయించు
స్వరకలాపమ్మునకు మదికా వశముఁ జేసి
బాహువులు సాచువాఁడ నీ ప్రణయసుఖసు
గంధబంధుర మగుభావబంధమునకు.

౧౦

గీ. చనవులు, విలాసములు, మనోజ్ఞములు నయిన
భవదమృతరాగభోగబాంధవము లతివ!
నాకుఁ బాడఁగట్టుచున్న వింత యెడముండి
నను నతిస్పష్టముగ దర్పణమునఁ బోలె.

౧౧

గీ. పెదవికదలించి పలికిన పొదలపొంత
కదలుచున్నవి నవ్వులింకను శుభాంగి!
త్రెంచిపోసిన ముత్యాలతీరుఁదోప
సూత్రమెందుఁ బాఱసితో చూపవమ్మ!




# * రాధపిలుపు

డునాళ్ళాయెరా మువ్వగోపాల
నినుజూడకేనింక నిలువజాలనుర!

* * * *

కనులలో మెదిలేవు కనకగోపాల
నీచక్కదనమెందు దాచుకోగలవు,
చాటుగా నిలుచుండి పాటబాడేవు,
మరుగున తలవంచి మాటలాడేవు,
ముసుగులో నేమిటో ముచ్చటాడేవు,
తెరలోను రాగాలు తీసేవు కృష్ణ!

* * * *

మురళివాయించరా వరహాలకృష్ణ!
నీజాడలను బట్టుకోజాలుదేను
గజ్జెలందెలు మ్రోయ కదపరాకాలు,
నీగుట్టుమట్టెల్ల నే నెఱుంగుదును,

* * * *

నెమిలిపుచ్చుతురాయి నిగనిగలాడి
నిను బట్టియిచ్చునంచును తీసినావె?
నీచుట్టువచ్చుగా పూచేనటంచు
బంగారు శాలువాపాతేసినావె?

ఎంతసేపాయెరా యౌవనాంతమున
నీకోసమొంటిగా ప్రాకులాడితిని,
ఎందెందు వెదకినా యీబృందయందు
నీవన్నిలే కానరావేల కృష్ణ!

* * * *

పొదలలో పూవువై పోయినావేమొ?
ఆలలో దూడవై యరిగినావేమొ?
తమ్మిలతీయగా ద్రవియించితేమొ?
కలికివేణువుతోడ కరిగినావేమొ?

* * * *

నిన్నెందు జూతురా చిన్నారికృష్ణ!
ఏమూల వెదికేదిరా మోహనాంగ!

* * * *

వెన్నదొంగిలి కానిపింపకున్నావా?
చీరలెత్తుకపోయి దూరమైనావా?
తరుణులే నిను దారి తప్పించినారో?
మధురలో పౌరులే మఱపించినారో?

* * * *

ఏమిసేయుదునురా నాముద్దుకృష్ణ!
నినుజూడకేనింక నిలువజాలనుర

రాధను వేధింపరాదురా కృష్ణ
రాధపై కోపింప రాదురా కృష్ణ!
పిలిచిముద్దీయరా ప్రేమాలపించె
కలిసి క్రీడింపరా కల్యాణకళిక!



# తిలకము



౧

కలిమికన్నియ కలికినుదుటను
కళలుచిమ్మే కనకతిలకమ!
వలపుకృష్ణుని వయసు తేనెకు
పాత్రమయ్యే తిలకమా!

౨

పార్వతీసతి ఫాలతలమున
గర్వరాగముఁ గ్రక్కు తిలకమ!
ధూర్వహుండగు ధూర్జటికి ధృతి
దూలఁద్రోసిన తిలకమా!

౩

పలుకుపడతుక పసుపునొసటను
మొలకజీవము లొలుకు తిలకమ!
కలిసి బ్రహ్మను కంఠమొత్తగ
కౌగిలించిన తిలకమా!

౪

రచ్చకీడిచి రమణిద్రౌపది
కుచ్చెలలుకొని కోకలూడ్చిన
చిచ్చువలె నా చెలువమొగమున
విచ్చిపొండిన తిలకమా!

౫

నరకుపైఁబడి కఱకుకోలల
నరకుసేయక సాహసముతో
నరకసాగిన నాటిసత్యా
ననమునంటిన తిలకమా!

౬

వెడదకత్తులు వేటలాడే
కడిదిఘోరపు కదనసీమల
తడిసివీరుల పడుచునెత్తుట
ధన్యమయ్యే తిలకమా!

౭

పరిమళమ్ములు పంతమాడగ
పరువపుంజిగి పైకిపొంగే
సరసకాముక శయనగృహముల
చక్కఁబెట్టే తిలకమా!

౮

సిగ్గువలదని చెంపలేయగ
భగ్గుభగ్గని వచ్చివలపును
బిగ్గనిలిపే పెండ్లికూతురు
నిగ్గుతేలే తిలకమా!

౯

ఇనుపసంకెల లేసిత్రోసిన
వనజముఖి దేవకీలలాటము
నెనసి కంసుని హృదయఫలకము
మొనవగిల్చిన తిలకమా!

# రామలింగారెడ్డి

శా. పిండీపిండని పాడియాఁబోదుఁగులన్ బింబింప కాదంబినీ
కాండం, బుర్వరపచ్చకోకలను సింగారింప నీవేళ వ్రా
దండల్ దక్కను ద్వారబంధముల సంధానించి ప్రేమోదయా
ఖండస్వాగతమిత్తు రాంధ్రు లనురాగస్ఫూర్తి రెడ్డ్యగ్రణీ!

శా. ఆజిన్ మార్మ్రోగమీఱ దిగ్విజయకన్యాకంచుకంబౌ కుసుం
బాజెండా నెగగట్టి, వాఙ్మయసరోమాధ్వీపిపాసారతిన్
మోజుల్ మీరగ మాయనుంగు తెనుగుంబూదోటఁ బోషించి రే
రాజుల్, తత్ప్రతిభాంక రెడ్డి కులధీరప్రాచురీచ్ఛాయనీ
తేజోరూపమునందుఁ జూచెదము ప్రీతిన్ రామలింగాగ్రణీ!

సీ. తొడిమయుఁ బూవు న ♦ దుకుపొందిక లుసూవు
పదభావముల కొక్క ♦ పాన్పమర్చి
విడెవువన్నియ పెద ♦ వి మెఱుంగలదిన ట్ల
లంకారముల నర్థ ♦ లక్ష్మి నేలి
లతికనికుంజవ ♦ లయమల్లినరీతిఁ
గథకు తెంపులులేని ♦ గమకమిచ్చి
కలహంస కొలనియ ♦ లలఁ బ్రోదిగొనుభంగి
నుడుల కొయారంపు ♦ నడలునేర్పి

గీ. రసికు రుచిరోపగూహన ♦ ప్రమదమొకట
వీరునిజభుజాస్ఫాలనో ♦ ద్వేగమొకట

ప్రకృతి తనవశమైనట్లు ♦ ప్రతిభతోడ
భారతమ్మెలె నేకవి ♦ బ్రహ్మమౌళి.

చ. అతని తెనుంగుతీర్పులర ♦ హాస్యములన్ గ్రహియించితత్ప్రిభా
యుతజయలేఖినీముఖ ని ♦ రంకుశపాలిత భారతీకళా
న్వితరసరేఖ రాగిలిన ♦ నేర్పరివంచు, త్వదీయభావలా
లితవిలసద్విపంచిఁ గది ♦ లింతుము నేఁడు కుతూహలంబునన్.

సీ. చవిఁజూచితి స్వతంత్ర ♦ చైతన్యభావనా
మాంసలాంగలకవి ♦ హంససూక్తి
పాటించితివి స్వైర ♦ భావభోగరిరంస
నెసఁగుపరాసుల ♦ రసికలిప్స
క్రీడించితివి ప్రౌఢి ♦ పేడెత్తు సూరన
సుకవివాగ్దోహద ♦ శోభనమున
వెలయించితివి కండ ♦ గలతెనుంగుఁగావ్య
తత్వమానందసూ ♦ త్రముల నరణి

గీ. నేఁడు నీకన్ననియోధు ♦ నికమహాంధ్ర
వాఙ్మయమునడిపింప నె ♦ వ్వఁడుసమర్థు
డెలమి నీకంకణము ధరి ♦ యించిముందు
త్రోవదీయుము రామలిం ♦ గావతంస!

# కలియుగార్జునుడు

(శ్రీ గుండవరపు అప్పారావుగారు.)

ఉ॥ కూరిమి వీరదంపతుల ♦ కుఁ జనియించిన భారతీయు, లా
చారతపోధురీణులయి ♦ సాధనఁ జేసి గడించి రేద్విష
ద్దారణదారుణంబయిన ♦ ధర్మధనుస్సు, తదీయ తేజ మిం
పారఁగ గాచు మా కలియు ♦ గార్జును నప్పయధన్వి నెప్పుడుఁ.

సీ. విన్నాము కదుపులో ♦ నున్న కండలు కద
లంగ భారత రణ ♦ రంగచరిత
చెవియొగ్గినాము, పు ♦ చ్చినశల్యములు మూఁప
గింప రామాదుల ♦ యూంపకోఁత
ఆలించితిమి గుండె ♦ లదరఁ బల్నాటి వీ
రుల గండ్రగొడ్డండ్ర ♦ రోషపదము,
అవధరించితిమి క ♦ న్గవ వేడియెఱుపెక్క
రాజపుత్రుల యుల్లె ♦ త్రాళ్లమ్రోత
గీ. భావమున; నంతెకాని మా ♦ పాపవశతఁ
జూచినది లేదు, చూడఁగా ♦ నోచలేదు
నేటికి ధనుస్సు నెత్తి సం ♦ ధించినావు
మా యదృష్టంబిదియె అప్ప ♦ రాయధన్వి!

ఉ. వ్రాసినవ్యాసవాక్యముల ♦ భావభరంబెటుగంగలేని స
న్న్యాసుల, మిట్టిమీామగలి ♦ నమ్మనటుం దగువీరగౌరవో
ల్లాసము నెట్లుసల్పఁగఁగ♦లారము, మాటలులేనిమాదు వి
శ్వాసమె వచ్చుశ్రపుని ♦ వాళిగ గైకొను మప్పరాణ్మణీ!

సీ. వల్లెఁజెప్పిన వేద ♦ పన్నాలువర్జించి
బాణదేశికుడైన ♦ ద్రోణుశక్తి
మంత్రోదకముల ని ♦ ర్మలమైనచేదోయి
రక్తాంజలిడిన భా ♦ ర్గవిసుదీక్ష
అమృతతేజోభూత ♦ మయిన గంటమువీడి
కత్తిదాలిచిన తి ♦ క్కనయశన్ను
గోచీవదల్చి కం ♦ గులవీరకాశ్శెఁ గ
ట్టిన యనపోత ధీ ♦ రుని తపన్ను

గీ. బ్రాహ్మణుడవయి ధనువుఁజే ♦ పట్టినట్టి
నీభుజాయుగళీపీఠి ♦ నిలుచుగాత
ఆంధ్రలోకద్రోణాచార్యుఁ ♦ డనెడికీర్తి
మోయుదువుగాత శ్రీయప్ప ♦ రాయధన్వి!



# శుద్ధసూచిక

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౬ | ౫ | చద్రికలం | చంద్రికలం |
| ౮ | ౬ | మణీ | మాణిక |
| ౧౯ | ౧౦ | హాదమును | హ్లాదమును |
| ,, | ౧౬ | యొడ్డెక్కితివి | యొడ్డెక్కితిని |
| ౨౦ | ౨ | రేఁవు | రేవు |
| ౨౧ | ౧౪ | సుకవికెస్వాధీన | సుకవి కస్వాధీన |
| ౨౮ | ౫ | మధుసాతము | మధుపాతము |
| ౩౦ | ౧ | సిగలో | సిగలలో |
| ౩౩ | ౬ | చెవ | చేవ |
| ౩౭ | ౧౬ | ధవళిమమని | ధవళమ యని |
| ౪౪ | ౧౫ | వేలెత్తి | వ్రేలెత్తి |
| ౫౦ | ౯ | వెచి | వేచి |
| ౫౪ | ౨౨ | సరి | సడి |
| ౫౫ | ౨ | కెమ్మెర | తెమ్మెర |
| ,, | ౮ | లోవువారు | బోవువారు |
| ౫౭ | ౧౧ | ఎవతవు | ఎవతెవు |
| ౫౮ | ౮ | భుజించు | భుజియించు |
| ౬౨ | ౫ | చెలి | తెలి |
| ౬౬ | ౧౧ | నిచ్చి | విచ్చి |
| ౬౮ | ౧౧ | సంత్రాణభరము | సంప్రీణనమ్ము |
| ,, | ౧౮ | జితించి | జతించి |
| ౭౧ | ౧౨ | పారెడు | పంచెడు |
| ౭౩ | ౮ | వులం......పో | లును నిక నేటి గానక ఫలో |
| ౭౫ | ౧ | తెలిమద్దు | నునుమద్ది |
| ౭౬ | ౯ | పాలిచిన | మలిచిన |
| ౭౭ | ౧౬ | నారళ్య | సారళ్య |
| ౭౮ | ౧౧ | నానందముక్ | నానందముల్ |
| ౮౦ | ౧౦ | క్రీడాధ్రీతుండ | క్రీడాప్రీతుండ |
| ,, | ౧౧ | తంప్రీ | తండ్రీ |

పరమపదస్థులైన
మాతాపితృ దేవతలకు
భక్తిపూర్వకముగ
సమర్పితము.

పరమపదస్థులైన
మాతాపితృ దేవతలకు
భక్తిపూర్వకముగ
సమర్పితము.

# సంపాదకీయము

సర్వజనసామరస్యమునకు తోడ్పడు ప్రాచ్యపాశ్చాత్య దేశముల యుత్తమజ్ఞానము ఆంధ్రులలో వ్యాప్తముచేయుట కుద్దేశింపబడిన ప్రాక్ప్రతీచీగ్రంథమాలయందు ప్రథమగ్రంథముగ శ్రీ ఎమ్. వి. ఎన్. సుబ్బారావు ఎమ్. ఏ గారు రచించిన యీ గ్రంథమును ప్రచురించుట కెంతయు సంతసిల్లుచున్నాము. సుబ్బారావుగారు ఆంగ్లభాషాకోవిదులు. పాశ్చాత్యగ్రంథముల సారమును గ్రోలినవారగుటచే, వారీగ్రంథము వ్రాయుటకర్హులని వేరుగ జెప్పనక్కరలేదు. వెనుక మా కోరిక ననుసరించి ధర్మసాధనికి ఇందలి వ్యాసములు వ్రాసి యిచ్చుటయె గాక, ప్రస్తుతము అవి యిట్లీ గ్రంథరూపమున ప్రకటించుట కనుజ్ఞ నొసంగినందులకు వారికి మిగుల కృతజ్ఞులము.

పాశ్చాత్యదేశములందు పందొమ్మిదవ శతాబ్దమున నూతనభావతరంగము లెట్లు బయలువెడలి విస్తరించెనో యీ గ్రంథమునందు విస్పష్టముగ సులభశైలిలో వివరింపబడెను.

ఆత్మగౌరవము, వ్యక్తిస్వాతంత్ర్యము, జీవితనిత్యవికాసము ప్రతిపురుషుడును ప్రతిస్త్రీయును లక్ష్యములుగ

గ్రహించి, సర్వమానవసమత్వము ప్రపంచమున వెలయు టకు, సేవారూపమగు ఈశ్వరారాధన సలుపవలయు నను మహోన్నతాదర్శమును ఈ గ్రంథము పాఠకుల దృష్టి పథమున నిలుపును.

ఏ మహనీయుల ద్వారమున ఆ భావపరంపర వ్యక్త మయ్యెనో వారి చరిత్రములు మార్గదర్శకములు. వారి పవిత్ర జీవితములు సయితము ఈ గ్రంథమునందు సంక్షి ప్తముగ పొందు పరుపబడెను. తద్గ్రంథపఠనము ధర్మ విచారణను పురిగొల్పి నూత్నజీవితాకాంక్షను వర్ధిల్ల జేయును; కాన ఆంధ్రులయందు అది విరివిగ జరుగ వలయు నని యభిలషించుచున్నాము.

ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల
రాజమహేంద్రవరము

కామరాజు హనుమంతరావు
సంపాదకుడు

# తొలిపలుకు

ఇందలి వ్యాసములు 1916 వ సంవత్సరమున 'ధర్మ సాధని' పత్రికయందు ప్రచురణమునకై అప్పటి పత్రికా సంపాదకులును నా మిత్రులు నగు శ్రీయుత కామరాజు హనుమంతరావు గారి ప్రోత్సాహముచే వ్రాసితి. ఇప్పు డివి గ్రంథరూపము దాల్చుటకును వారి ప్రోత్సాహమే కారణము.

భాషావిషయక సవరణలు కొన్ని సూచించినందులకు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారికిని మహారాజశ్రీ పింగళి లక్ష్మీకాంతము ఎమ్. ఏ. గారికిని నే నత్యంత కృతజ్ఞుడను.

మతుకుమల్లి సుబ్బారావు

# పీఠిక

ఏకత్వము సత్యము ; భిన్నత్వము సుందరము. ఏకత్వము తత్త్వమునకు మూలసూత్రము ; భిన్నత్వము జీవితమునకు ముఖ్యాధారము. ఈ రెంటియొక్క సమన్వయమునందే విజ్ఞానము పరిపక్వ మగుచున్నది ; వేదాంతము సాఫల్యత నొందుచున్నది ; చరిత్రకు సామరస్యము ఏర్పడుచున్నది.

తూరుపు వేరు ; పడమర వేరు. వాని కాంతులు వేరు ; వాని రుచులు వేరు ; వాని వికాసములు వేరు. ప్రాచ్యుల ఆదర్శములు వేరు ; పాశ్చాత్యుల ఆశయములు భిన్నములు. జీవనవిధానములందు, కర్మకాండలయందు, నైతికనియమములందు, రాజ్యాంగతంత్రములందు, సాంఘికాచారములందు ప్రాచ్యులకును పాశ్చాత్యులకును కడుంగడు భేదము కలదు.

కాని తరిచి చూచిన ఈ భిన్నత్వమునకు అతీతమైన ఒక ఐక్యత కనబడును. ప్రాచ్యులును పాశ్చాత్యులును ఒకే మనుష్యజాతికి చెందిన వారు. సుఖదుఃఖములు, అనురాగాది భావవిశేషములు వారికి సామాన్యములు. చిత్తవృత్తి, మానసికవికాసము, ఆధ్యాత్మికోన్మేషము వారి ఏకత్వమును ప్రకటించుచున్నవి.

అనేకత్వమునందలి యేకత్వతత్త్వమును, ఏకత్వము నందలి భిన్నత్వసౌందర్యమును దర్శనీయములు.

మరియొక విషయము. గిర్రున తిరుగుచున్న అదృష్ట చక్రము పాశ్చాత్యదేశములను ఇప్పుడు పైకి తీసికొని వచ్చినది. ప్రస్తుతము ప్రపంచముయొక్క దృష్టిని ఆకర్షించినది పాశ్చాత్యవిజ్ఞానము. కావున పాశ్చాత్య కవీంద్రుల, తత్త్వజ్ఞుల, రాజనీతివేత్తల పరిచితి అపేక్షణీయము.

పందొమ్మిదవ శతాబ్దపు పాశ్చాత్యభావప్రతినిధు లనదగు మహాపురుషుల కొందరను గూర్చి యథాశక్తిని ఈ చిన్న పొత్తమునందు ప్రశంసించితి. పాశ్చాత్యభావప్రపంచము అపార మయినది ; అందలి మహాపురుషుల సంఖ్య అనల్పము; వారి భావబాహుళ్యము అపరిమిత మయినది. స్థాలీపులాకన్యాయముగ విషయమును గురించి ముచ్చటించితి.

# విషయములు


| | | | |
|---|---|---|---|
| కార్లయిలు | ... | ... | ౧ |
| ఎమర్సను | ... | ... | ౧౫ |
| గెటి | ... | ... | ౨౭ |
| మాజిని | ... | ... | ౩౭ |
| రినాను | ... | ... | ౫౭ |
| టోల్‌స్టాయి | ... | ... | ౬౭ |
| ఇబ్సెను | ... | ... | ౮౩ |
| ఏమియల్ | ... | ... | ౯౫ |

have I travell'd in the realms of gold,
any goodly states and kingdoms seen."

"*God's is the West,*
*God's is the East,*
*And Northern and Southern lands*
*Rest in the peace of His hands.*"